సంపుటి 8
సంచిక 20

# సోవియట్ భూమి

లక్టోబర్ 28, 1957

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖచే ప్రచురింపబడుతోన్న సచిత్ర పక్ష పత్రిక



## అక్టోబర్ విప్లవ సంచిక

"... ఇక్కడ నాకు ప్రతిదీ అద్భుతంగా కనుపించింది. ఇతర దేశాలలో దీనికి ఎక్కడా పోలికే లేదు. సమూలంగా ఇది విభిన్నమైనది ..." అని, 1917 మహత్తర అక్టోబరు విప్లవానంతరం ప్రవేశపెట్టబడిన నవవిధానాన్ని సందర్శించిన తరువాత వ్రాశారు రవీంద్రకవీంద్రులు. ఆ మహాకవి చూచినది నవశక ప్రారంభాన్నే. అక్టోబరు విప్లవం ప్రసరితం చేసిన మహత్తర శక్తులు, ఒకనాటి వెనుకబడిన రష్యాను, పురోగమిస్తున్న దేశాలలో ఇప్పటి ఒక అగ్రగామి దేశంగా పరివర్తితం చేశాయి.

'సోవియట్ భూమి' రాబోవు సంచిక మహత్తర అక్టోబరు విప్లవ 40వ వార్షికోత్సవ ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. 1947 అక్టోబర్ విప్లవ ప్రతిఫలంగా ఇప్పటివరకు సోవియట్ దేశంలో సాధింపబడిన అద్భుత విషయాలన్నింటిని యిది వివరిస్తుంది.

61 పుటల ఈ విశేష సంచికకు, 8-పుటల వర్ణ చిత్రాను బంధం ఉంటుంది!

మీ ప్రతికై త్వరపడండి

~~~~~~~~~~

## ఈ సంచికలో



## [illegible]

అక్టోబరు నాలుగవ తేదీన సోవియట్ దేశం మొట్టమొదటి కృత్రిమ ఉపగ్రహాన్ని విజయవంతంగా అంతరిక్షంలోకి పంపిన విషయం ప్రపంచాని కంతటికీ తెలుసు.

ఇది అంతర్జాతీయ భూభౌతిక సంవత్సర కార్యక్రమంలో ఒక భాగం.

సోవియట్ దేశపు పరిశోధనా సంస్థలు, డిజైనింగ్ సంస్థలు పెద్ద యెత్తున తీవ్రంగా జరిపిన పరిశోధనల ఫలితమిది. లభ్యమవుతున్న రాలి సమాచారాన్నిబట్టి వాహకరాకెట్ కృత్రిమ గ్రహానికి అవసరమైన, సెకెండుకు 8 000 మీటర్ల గ్రహపథాను సరణ వేగాన్ని కల్పించినట్లు వెల్లడవుతున్నది. ఉపగ్రహమిప్పుడు భూమండలం చుట్టు తొమ్మిదిపందల కిలోమీటర్లుగా అంచనా వేయబడుతున్న యెత్తున అండాకార ప్రక్షేపచక్రంలో తిరుగుతున్నది.

ఈ ఉపగ్రహం 58 సెంటిమీటర్ల వ్యాసరేఖను, 83.6 కిలోగ్రాముల బరువును కలిగి, గోళరూపంలో ఉన్నది. దానిలోపల రెండు రేడియో ట్రాన్స్‌మీటర్లు ఉన్నాయి. అవి 20.005, 40.002 మెగాసైకిల్స్ ఫ్రీక్వెన్సీ (సుమారు 15, 7.5 మీటర్ల వేవ్‌లెంగ్తు)మీద నిరంతరం సంకేతాలను పంపుతున్నవి.

తీవ్రమైన ఉష్ణ పరిస్థితుల్లో పనిచేయగల శక్తివంతమైన ఇంజన్లతోపాటు కృత్రిమ గ్రహాన్ని అంతరిక్షంలోకి పంపడానికి చక్కగా డిజైను చేయబడిన ఒక వాహక రాకెట్ రూపొందింపబడింది. ఉపగ్రహాన్ని దాని కక్షిలోకి ఇదివరకే నిర్ణయింపబడిన ప్రక్షేపచక్రంలో నమ్మకంగా పంపేందుకు బహు కచ్చితంగాను, సమర్థవంతంగాను పనిచేయగల ఆటోమేటిక్ కంట్రోలు పద్ధతి యేర్పాటు చేయబడింది.

ఉపగ్రహం వాహకరాకెట్ ముందు భాగములో ఉంచబడింది. పైన రక్షణ కొరకు కూచియైన ఆకారంలో వున్న ఒక డిప్ప యేర్పాటు చేయబడింది. రాకెట్ నిటారుగా పేల్చబడింది. అలా పేల్చబడిన వెంటనే రాకెట్‌లో యేర్పాటు చేయబడిన "ప్రోగ్రామ్ డివైజ్" దానిని నిటారుగా వెళుతున్న మార్గం నుంచి మళ్ళించింది. అలా కొన్ని వంద కిలోమీటర్ల యెత్తుకు వెళ్ళి రాకెట్ దానికి నిరేశింపబడిన కక్షి చేరుకొని భూతలానికి సమానాంతర రేఖలో ఒక సెకెండుకు 8,000 మీటర్ల వేగంతో కదలసాగింది. ఇంజన్లు పనిచేయడం ఆగిపోయిన తర్వాత రక్షణకు యేర్పాటు చేయబడిన డిప్ప విసురుతో విడగొట్టబడింది. కృత్రిమ గ్రహం రాకెట్‌నుండి విడిపోయి స్వతంత్రంగా కదల సాగింది. భూమండలం చుట్టు ఇప్పుడు చిన్నారి చంద్రుడూ, వాహక రాకెట్టూ మాత్రమే గాక రక్షణకొరకు యేర్పాటు చేయబడిన డిప్ప కూడా తిరుగుతున్నది. ప్రముఖ సోవియట్ పదార్థ విజ్ఞానశాస్త్రవేత్త, ఆధునిక ఖగోళ పరికరాల డిజైనరు అయిన వ్లాదిమీర్ విన్నిక్ తెలియజేస్తున్నదానినిబట్టి "సోవియట్ నిర్మిత చంద్రగ్రహం" అసలు చంద్రగ్రహం యొక్క వేగంకంటే ఎనిమిదిరెట్ల వేగంతో పరిభ్రమిస్తున్నదని వ్యక్తమవుతున్నది. అనగా ఇతర గ్రహాల వైపుకు అంతరిక్షంలోకి వస్తువును పంపడానికి అవసరమయ్యే వేగానికి నూటికి 25 పాళ్ళు మాత్రమే తక్కువన్నమాట.

ఈ కృత్రిమ గ్రహం యెంతకాలం ఆ కక్షిలో పరిభ్రమిస్తూ వుంటుందో కచ్చితంగా చెప్పడం కష్టం. అది వాతావరణం దట్టమైన
~~~~~~~~~~

పొరల్లోకి వచ్చినప్పుడు, గాలిరాపిడి అధికమై, బాగా వెడెక్కి చివరికి మండి బూడిదై పోతుంది.

కాని, వాతావరణం యొక్క ఉపరిభాగపు పొరల సాంద్రతను గురించి మనకు తెలియ వచ్చిన సమాచారాన్ని బట్టీ, ప్రక్షేపవక్ర పరిమాణాలను బట్టీ అది చాలాకాలంవరకు భూమండలం చుట్టూ తిరుగవచ్చునని భావించడానికి ఆధారాలున్నాయి.

అంతర్జాతీయ భూ భౌతిక సంవత్సర కాలంలో ఇంకా కొన్ని కృత్రిమ ఉపగ్రహాలను అంతరిక్షంలోకి పంపడానికి సోవియట్ దేశం ఉద్దేశిస్తున్నది. అవి ఇప్పటి దానికంటే పెద్దవిగాను, బరువుగాను ఉంటాయి. పెద్దయెత్తున వైజ్ఞానిక పరిశోధనలను జరపడానికి తోడ్పడుతాయి. అంతరిక్షంలో ప్రయాణం చేస్తున్నప్పుడు ప్రాణులకు యేమిజరుగుతుందో తెలుసుకొనేందుకు సోవియట్ దేశం జంతువులతో కూడిన ఒక ఉపగ్రహాన్నికూడా పైకి పంపబోతున్నది.

సోవియట్ విజ్ఞానశాస్త్రం తాను అత్యంత అద్భుతమైన విషయాలను కనుకొనగలనని ప్రపంచానికి మరొకసారి రుజువు పర్చింది.

కృత్రిమ ఉపగ్రహాన్ని అంతరిక్షంలోకి పంపడంలో సోవియట్ దేశానికి లభించిన విజయం. సోవియట్ దేశంలో గత నలభై సంవత్సరాలలో విజ్ఞానశాస్త్రం, ఇంజినీరింగ్ విషయాలలో సాధింపబడిన మహత్తరాభివృద్ధి ఫలితమేనని తేలుతుంది.

సామ్యవాద సమాజ ప్రజలయొక్క స్వతంత్రము, చైతన్యవంతము అయిన కృషి మానవుని అత్యంత సాహసవంతమైన కలలను గూడా యేవిధంగా నిజం చేయగలదో ఇప్పటి తరం వారు చూడగలరనిపిస్తుంది.

---

# సోవియట్ విజ్ఞానశాస్త్రం, ఇంజనీరింగుల మహత్తర విజయం

సోవియట్ దేశంలో సృష్టింపబడిన తొలి కృత్రిమ ఉపగ్రహం, మనగ్రహం చుట్టూరా తన పరిభ్రమణాన్ని సాగిస్తూనే వుంది. సర్వ ప్రపంచమూ గమనిస్తూనే వుంది, దాని గమనాన్ని.

సోవియట్ విజ్ఞాన శాస్త్రవేత్తలు సాధించిన యీ మహాద్భుత కృత్యానికి మానవాళి అంతా గర్విస్తూ వుంది. విజ్ఞానశాస్త్ర రంగంలో ఒక నూతన శకానికి నాందీ వాచకం పలికిన అత్యంత ప్రముఖ విజయంగా, ప్రతిచోటా యీ ఘటన భావింపబడుతోంది. చాలా మంది విదేశీ విజ్ఞాన శాస్త్రవేత్తలూ, పత్రికలూ, అమెరికాతో శాంతియుతమైన పోటీలో సోవియట్ విజ్ఞాన శాస్త్రవేత్తలు గెలుపొందారని ఉద్ఘాటిస్తూ వుండడం జరుగుతోంది.

మాంఛెస్టర్ విశ్వవిద్యాలయంలో రేడియో ఖగోళశాస్త్ర ఆచార్యుడు డాక్టర్ ఎ. లొవెల్, సోవియట్ దేశ ఉపగ్రహాన్ని ఎగురవెయ్యడం అద్భుతమైన విజయమనీ, ఆ దేశం అందుకున్న సాంకేతిక ప్రగతి ఉన్నతస్థాయిని యిది తెలియజేస్తుందనీ అన్నారు. సోవియట్ విజ్ఞాన శాస్త్రవేత్తలు, బ్రిటిష్, అమెరికన్ విజ్ఞాన శాస్త్రవేత్తలను బాగా మించిపోయారని ఆయన ఉద్ఘాటించారు. ఉపగ్రహాన్ని ఎగురవేయడంలో రష్యన్ల ముందర అమెరికన్లు వెనకబడిపోయారని ఆయన అన్నారు.

ఫ్రెంచి వార్తా పత్రిక "కంబాట్" "సోవియట్ దేశం అమెరికాతో వైజ్ఞానిక పోటీలో ఒక ప్రముఖ విజయాన్ని సాధించింది. అమెరికన్ కృత్రిమ ఉపగ్రహం వచ్చే వసంతంలో మాత్రమే ఎగురవేయబడుతుందన్నది అందరికీ తెలిసిన విషయమే" అని వ్రాస్తోంది.

"ప్రశంస, ఆశ్చర్యం, గాభరా—టాస్ ప్రకటన అమెరికాలో పుట్టించిన భావ సరళిని యీ మాటలు అన్నిటికంటె బాగా వ్యక్తపరుస్తాయేమో" అంటూ 'ప్రవ్దా' ప్రత్యేక విలేఖరి న్యూయార్క్ నుండి వ్రాస్తున్నారు.

అసోసియేటెడ్ ప్రెస్ కథనం ప్రకారం, అంతర్జాతీయ భూపదార్థ విజ్ఞాన సంవత్సర అమెరికన్ సంఘాధ్యక్షుడు డాక్టర్ జోసెఫ్ కప్లన్ "తమకుగల స్వల్ప వ్యవధిలో వారు చేసినది నన్ను ఆశ్చర్యపర్చింది, యీ దేశానికి గల వ్యవధికంటె యిది ఎక్కువకాదు" అని అన్నారు. ఇదొక గొప్ప అద్భుత విజయంగా ఆయన భావించారు. అంతర్జాతీయ సహకార దృష్ట్యా, భూమియొక్క కృత్రిమ గ్రహాన్ని ఎగురవేయడం అపార ప్రాముఖ్యంగల విషయం, "వారిది చేశారు, వారిది మొదట చేశారు" అన్నారాయన.

"అంతర్గ్రహ మహాకాశంలో రష్యన్లు తమ్ము ఓడించివేశార"ని అమెరికన్ విజ్ఞానశాస్త్రవేత్తలు ఒకవిధంగా విచారిస్తున్నారని, "న్యూయార్క్ టైమ్స్" పత్రిక నిరాశగా వ్రాస్తున్నదని "ప్రవ్దా" విలేకరి వ్రాస్తున్నారు. కాని సోవియట్ దేశ విజయంపట్ల తమ ప్రశంసను వ్యక్తపరచడానికి యిది అటంకం కాలేదు. "ఇది వారి అద్భుత

(మిగత 40వ పుట చూడండి)

# రష్యన్ నదీమతల్లికి భారతీయుని కానుక

వి. కుద్ర్యవత్సేవ్

సంపాదకునికి రోజూ వచ్చే ఉత్తరాలను చూస్తూవుంటే మాకొక చక్కని ఉత్తరం కనిపించింది. దానిని వ్రాసినది ప్రేమ్‌చంద్ అన్న భారతీయ విద్యార్థి.

"అత్యంత గౌరవనీయులైన సంపాదకులారా!" అంటూ మొదలైంది ఉత్తరం. "ఓల్గా మాత పవిత్ర జలాలకు, యీ పంక్తులను దయచేసి అందజేయగలరా? ఇందుకు నేను మీకు శాశ్వతంగా కృతజ్ఞతాబద్ధుణ్నయి వుంటాను," పుష్పగుచ్ఛాలతోబాటుగా తన లేఖను ఓల్గానదికి అర్పించవలసిందిగా కూడా ఆ లేఖకుడు సంపాదకుణ్ని అర్థించారు. "సకల రష్యన్ నదులకూ మాత అయిన ఓల్గాకు తన కానుక" అది.

మా భారతీయ మిత్రుని కోర్కెను నెరవేర్చడానికి మేము నిర్ణయించుకున్నాము. కాని ఎక్కడ? మహాపురుషుడు లెనిన్ జన్మస్థానమైన ఉల్యనోవ్స్క్ వద్దా? లేదా మూడు వందల ఏళ్ళ క్రిందట డాన్ కొసక్కు స్తేపన్ రజిన్ ప్రజల సౌఖ్యం కోసరం పోరాడడానికి పూనుకున్న అస్త్రఖాన్లోనా? లేదా అన్నిటికంటె పెద్ద జల విద్యుత్కేంద్రంగల నగరమూ, మా ప్రజల వీరోచిత శ్రమ జీవన చిహ్నమూ అయిన కుయ్‌బిషేవ్‌లోనా? లేదా చరిత్రాత్మకమైన స్టాలిన్‌గ్రాడ్ వద్దా?

కాని మా భారతీయ స్నేహితుని కోర్కెను నెరవేర్చడానికి కలినిన్ నగరం, తగిన స్థలమని మేము భావించాము. ఇదే అన్నిటి కంటె చాలా అర్హమైన స్థలం; ఎందువల్లనంటే యిక్కడనే ఐదు శతాబ్దాల క్రితం త్వెర్ నగరానికి చెందిన ఒక వర్తకుడు (యిది కలినిన్ నగరానికి పూర్వపు పేరు) అఫనసీ నికితిన్ అన్నాయన దీర్ఘ ప్రయాణానికి బయలుదేరారు-భారత దేశాన్ని సందర్శించిన మొదటి రష్యన్ యీయనే. ఈయన అక్కడ అనేక సంవత్సరాలు నివసించారు. మూడు సముద్రాల పైని యాత్రలు అన్న గ్రంథాన్ని వ్రాశారు. దీనిలో ఆయన తాను చూసినదానినంతట్నీ వివరించారు.

స్థలనిర్ణయం అయ్యాక, యీ కోర్కెను ఎవరు నెరవేర్చాలన్న విషయానికి వచ్చాము. ప్రేమచంద్ విద్యార్థి గనుక, దీనిని

(మిగత 40వ పుటలో)



కలినిన్‌లోని అఫనసీ నికితిన్ స్మారక చిహ్నం

ఆ యువతులు భారతీయ మిత్రుని లేఖను పూల మధ్యన, పడిపోకుండా పదిలంగా పెట్టారు





# వోల్గాపైని

రెడ్ స్క్వేర్‌లో మే దినోత్సవ ప్రదర్శనలను చూచి ఒక విదేశీ యాత్రికుడు యిలా అన్నాడు:

"ఇది ఓల్గానది మహా ప్రవాహంలా గున్నది!"

రష్యన్ ప్రజల శక్తిని ఈ మహానదితో పోల్చడం పరిపాటి. ఓల్గా రష్యాకు చిహ్న మనిపిస్తుంది.

భారతదేశం గుండా గంగానది, అమెరికా గుండా మిసిసిపి నది, జర్మనీగుండా రైన్ నది ప్రవహించినట్లు ఓల్గా నది సోవియట్ దేశం గుండా ప్రవహిస్తుంది. ఈ నదికి ఎగువ భాగంలో మాస్కోవా నది జన్మించింది. లెనిన్ ఓల్గా నదీ తీరంలోనే పుట్టిపెరిగారు. మానవ సంతతిని ఫాసిస్టు బానిసత్వంలో ముంచే ప్రమాదాన్ని కల్పించిన రెండవ ప్రపంచ యుద్ధం గమనాన్నే మార్చివేసిన స్టాలిన్‌గ్రాడ్ నగరం ఓల్గా నది తీరంలోనే వున్నది. ఓల్గా రష్యాదేశపు అశనాళము.

భారతీయులకు, రష్యన్లకు ఓల్గా ఇంకొక ప్రాముఖ్యతనుగూడా కలిగి వున్నది. భారతదేశానికి వచ్చిన మొట్టమొదటి రష్యన్ పౌరుడైన, అఫనసి నికితిన్ అనే వర్తకుడు త్వెర్ నుండి పదిహేనవ శతాబ్దంలో యీ నది మీదుగానే ప్రయాణం చేశారు. భారతదేశం, రష్యాలకు సంబంధం కల్పించిన మొట్టమొదటి మార్గం ఇదే. ఆయన భారతదేశానికి మిత్రుడుగా వచ్చారు.

మనంకూడా 1957 లో ఓల్గా నది మీదుగా పయనిస్తున్నట్లు ఊహించుకొందాము.

మాస్కోకు పశ్చిమోత్తరదిక్కున వాల్దాయ్ కొండప్రాంతంలోని ఒక చిత్తడినేలలో చిన్న యేరుగా మొదలవుతుంది ఓల్గా. రష్యన్లందరిచేత గౌరవప్రదంగా చూడబడే ప్రాంతాన్ని నిర్దేశించడానికి ఆ స్థలంపైన ఎవరో నిర్మించిన కొయ్య ఇంటిలోంచి అది ప్రవహిస్తున్నది. ఆ యింటిలో వున్న చిన్న దొరువులోంచి మందగమనంతో ప్రారంభమవుతుంది.

వెండిలాగ తళతళ మెరుస్తూ వుండే యీ ప్రవాహపు గలగలారవం కొండరావిచెట్లు, దేవదారుచెట్ల మధ్య వినబడనే వినబడదు. రెల్లు పొదలను ఒరుసుకొంటూ, రాళ్ళమధ్య గంతులు వేస్తూ ప్రవహిస్తుంది. అటుతర్వాత అది అడవులలోని సరస్సులలోంచి ప్రవహిస్తూ, ఉపనదుల కలయికతో విశాలమై ఒక మహానదీగా

# విహారయానం

రచన:- ఎస్.ఎస్.మిఖైలోవ్

రూపొందుతుంది. ఇది రిజేవ్ నగరం దగ్గరకు వచ్చేటప్పటికల్లా, నీరు నిండుగా వున్నప్పుడు మాత్రం ఇవతలి గట్టునుండి అవతలి గట్టుకు పడవలు నడవగలిగే స్థితికి వస్తుంది. కాలినిన్ నగరం మొదలుకొని పడవలు బాహాటంగా వేసవికాలమంతా ఈ నదిమీద నడుస్తుంటాయి.

కాలినిన్‌కు దిగువన, ఇవాన్కోవా జల విద్యుత్ కేంద్రం దగ్గర, మాస్కో సముద్రం అని పిలువబడే రిజర్వాయర్ ఓల్గా నది మీద కట్టబడినచోట ఒక కాలువ నదిలోకి వచ్చి పడుతుంది. ఈ కాలువే సోవియట్ దేశ రాజధానితో సంబంధాన్ని కలుపుతుంది.

ఒక చిన్న నదీ తీరంలోవున్నది మాస్కో. కాని నగరం పెరిగిన తర్వాత, అందులోను ముఖ్యంగా పంచవర్ష ప్రణాళికల కాలంలో నీటికొరత యేర్పడింది. తగు నీటి సదుపాయాన్ని కల్పించేందుకు ఓల్గానుండి మాస్కో నదికి 127 కిలోమీటర్ల కాలువ ఒకటి త్రవ్వబడ్డది. దాని పేరే మాస్కో కాలువ.

ఇప్పుడు పెద్ద ఓడలు సరాసరి మాస్కో నుండి ఓల్గాకు వెళ్ళి, అక్కడినుండి బాల్టిక్, తెల్ల, కాస్పియన్, నల్ల సముద్రాలకు వెళ్ళగలవు.

మనం గోర్కీ నగరానికి చేరుకొంటా మనగా ఇంకా చాలాముందే కుడివైపు తీరం జీవంతో ఉట్టిపడుతూ కనబడుతుంది. మొట్టమొదటగా మనకు ప్రావ్‌దిన్స్కి దగ్గర ఒక పెద్ద కాగితపు మిల్లు కనబడుతుంది. ఆటు తర్వాత క్రాస్నొయీ సొర్మొవా నౌకా నిర్మాణ కేంద్రాన్ని చూస్తాము.

జారు పరిపాలనా కాలంలో ఈ నౌకా నిర్మాణ కేంద్రం కార్మికులు చురుకైన విప్లవ పోరాటాన్ని కొనసాగిస్తుండేవారు. 1902లో వారు ప్రఖ్యాతి గాంచిన తమ మే దినోత్సవ ప్రదర్శనలను జరిపారు. దారిద్ర్యం తప్ప మరేమీ యెరుగని మురికి కార్మిక పేటల్లో ప్రథమపర్యాయంగా ఎర్ర జెండాలు ఎగిరాయి. మాక్సిమ్ గోర్కీ "అమ్మ" అన్న తన నవలలో ఈ సంఘటననే చిత్రించారు.

ఓల్గా తీర ప్రాంతాల్లో రష్యన్లు, తాతార్లు, చువాష్‌లు, మారీలు నివసిస్తుంటారు. అక్టోబరు విప్లవానికి పూర్వం చివర చెప్పిన మూడు జాతులకు ఏ హక్కులూ వుండేవికావు. విప్లవానంతరం అవి స్వపరిపాలనా రిపబ్లిక్‌లుగా యేర్పడ్డాయి. రష్యన్ సమాఖ్యలో ఒక భాగంగా వుంటున్నాయి. తాతార్, చువాష్ మారీ జాతుల ఆర్థిక, సాంస్కృతిక పురోభివృద్ధికి రష్యన్ ప్రజలు తమ ఔదార్య పూర్వకమైన సహాయాన్ని అందజేస్తున్నారు.

గోర్కీ నగరం దాటినతర్వాత ఓల్గా నది ఈ స్వయం పరిపాలక రిపబ్లిక్‌ల సరిహద్దుల గుండా ప్రవహిస్తుంది. మారీ రిపబ్లిక్ ఎడమకి తీరంలో వున్నది. సువిశాలమైన యీ రిపబ్లిక్ అడవులతో కూడి వున్నది. ఒక్కసారి దాని వైపు చూచినవారి కెవరికైనా దాని ప్రధాన సంపద కలప అని వ్యక్తమవుతుంది. కలప



ఓల్గా మూర్తి





యురొస్లావ్‌ల టైర్ ప్లాంటు సరకు, ఓల్గా నదిమీద ఓడపై రవాణా చేయబడుతోన్న దృశ్యం

పరిశ్రమ కారణంగా ఓల్గా నదీ తీరంలో ఓల్జ్‌స్క్ ఒక నూతన నగరం ఉద్భవించింది.

కుడి తీరంలో వున్న ఎత్తయిన కొండమీది నుంచి చూస్తే చువాష్ స్వయం పరిపాలక రిపబ్లిక్ రాజధాని చెబొక్సరీ

ఆస్త్రఖాన్ నగరంలోని మత్స్య పరిశ్రమకు చెందిన నౌకానిర్మాణ స్థావరం



కనబడుతుంది. సోవియట్ పరిపాలనా కాలంలో ఈ నగరం బాగా పెరిగింది. నూతన జీవితంతో తొణికిస లాడుతున్నది.

మన ఓడ నింపాదిగా అడవి ప్రాంతాలను దాటి ముందుకు పోతున్నది. దట్టమైన అడవులకు బదులు అక్కడక్కడా ఓక్ చెట్టు మాత్రం అగుపడుతున్నాయి, ఓల్గా నదీ ప్రాంతంలోని జాతీయ రిపబ్లిక్‌లు అన్నింటిలోకి అతి పెద్దదైన తాతార్ రిపబ్లిక్ భూభాగం ఇదే.

కుడివైపు తీరంలో లెనిన్ జన్మస్థానమైన ఉల్యనోవ్స్క్ (పూర్వపు సింబిర్స్క్) విస్తరించి వున్నది. ఆ మహానాయకుని పూర్వపు గృహంలో స్థాపింపబడిన లెనిన్ మ్యూజియంను చూడడానికి దేశం నలుమూలలనుండీ విదేశాలనుండికూడా జనం వస్తుంటారు. లక్షలాది ప్రజలకు గౌరవప్రదమైనదీ స్థలం.

బ్రహ్మాండమైన క్యుబిషేవ్ జల విద్యుత్ కేంద్రం లాకులు దాటిపోతున్నామిప్పుడు మనం. ఇరవై లక్షల కిలోవాట్ల కెపాసిటీగల ఈ విద్యుత్ కేంద్రం త్వరలోనే పూర్తిగా స్థాపితమై నిండు కెపాసిటీలో పనిచేస్తుంది. ఇక్కడ ఉత్పత్తి చేయబడిన విద్యుచ్ఛక్తి ఓల్గా మండలానికి సరఫరా చేయబడుతుంది. కొంతభాగం 700 కిలోమీటర్ల పొడవుగల హైటెన్షన్ లైన్‌ద్వారా మాస్కోకు అందజేయబడుతుంది.

క్యుబిషేవ్‌కు దక్షిణ దిశగా పోతుంటే, అసలు చెట్లు కనబడడమే అరుదై పోతుంది. గాలి పొడిగా ఉంటుంది. సోవియట్ దేశంలోని వర్షాలు తక్కువైన అన్ని ప్రాంతాలలో వలెనే ఇక్కడగూడా సమిష్టి వ్యవసాయ క్షేత్రాల చుట్టు రక్షణ అడవులు నాటబడ్డాయి. ఓల్గా నదికి సమాంతర రేఖలో నాటబడిన యీ అడవులు త్వరలోనే పెరిగి పెద్దవవుతాయి. యుగయుగాలుగా యీ మండలానికి ప్రమాదంగా ఉంటూవచ్చిన వేడిగాడ్పులను అరికడతాయి.

ఇంకా మనం దిగువకు పోతున్నకొలది నదిగట్లు మరింత నిట్రవుగాను, ఎత్తుగాను కనబడుతుంటాయి. అలా పోతుంటే మన



స్టాలిన్‌గ్రాడ్ వద్ద, ఓల్గానది ఆనకట్ట మధ్యభాగం

కళ్ళముందు నది పొడుగున కొన్నిడజన్ల కిలో మీటర్ల పొడవున విస్తరించివున్న గంభీరమైన స్టాలిన్‌గ్రాడ్ నగరం ప్రత్యక్షమవుతుంది.

1942లో ఇది మానవాళి చరిత్రలోని మహా రణరంగాలలో ఒక దానికి ఆలవాలమైంది. నాజీ సేనలు ఓల్గా నదిని దాటి నగరాన్ని నేల మట్టం గావించాయి. ఫాసిస్టు సేన తన యావత్తు శక్తిని సమీకరించి, యీ నగరం మీద దెబ్బతీసింది. కాని ఇక్కడే దాని వెన్నెముక విరుగగొట్టబడింది. నాజీ యుద్ధ యంత్రం యా త్తు తుత్తునియలై పోయింది.

ఓల్గానదీ జలాలు దక్షిణ దిశగా వేడిగా వుండే కాస్పియన్ మండలంగుండా ప్రవహిస్తాయి. స్టాలిన్‌గ్రాడ్ మొదలుకొని కాస్పియన్ సముద్రం వరకు ఎడమవైపున ప్రవహించే ఉపనదిపేరు అక్తుబా. ఓల్గా-అక్తుబా ప్రాంతంలోని పల్లపు ప్రాంతాలు వసంత కాలంలో నీటిమయమైపోతాయి. ఆ నీరంతా పోయిన తర్వాత ఒండ్రుమట్టి అక్కడ దిగబడి ఉండిపోతుంది. ఈ మట్టిలో కూరగాయలు, అందులో ముఖ్యంగా టమాటాలు సమృద్ధిగా పండుతాయి. కాని కష్టపడకుండా మాత్రం సమిష్టి వ్యవసాయక్షేత్రాలకు ఇలాంటి సమృద్ధికరమైన పంట లభించదు. ప్రకృతిని సాధించవలసి వున్నది. డైక్‌లు, పంపింగ్ స్టేషన్ల సహాయంతో వసంత కాలంలో నీరు బయటికి తోడివేయబడుతుంది. వేసవి కాలంలో తిరిగి నీరు లోపలికి తోడబడుతుంది.

పల్లపునేల దక్షిణ దిశగా ఒక డెల్టా రూపములో విస్తరించివున్నది, దానికి నడిమధ్యగా అస్త్రఖాన్ నగరం వున్నది.

ఈ ప్రాంతంలోనే ఓల్గానది కాస్పియన్ సముద్రంలో సంగమిస్తుంది.



ఖిమ్కినది ఓడరేవు

స్టాలిన్‌గ్రాడ్ జల విద్యుత్కేంద్ర నిర్మాణ స్థావరం. మెయిన్ క్రేన్‌సిల్, కేబుల్‌వేల ఒక దృశ్యం





ఓల్గా నదిమీద

ఓల్గా నది అంటే రష్యన్ ప్రజలకు ఎంతో ప్రేమ. దానినిగురించి ఎన్నో పాటలూ, ఎన్నో కథలూ వున్నాయి. అనాది కాలం నుండి ప్రజలకు అన్నపానాల నిచ్చిన యీ నదిని ఎవరైనా ప్రేమించకుండా ఎలా వుండగలరు ? కాలం గడిచినకొద్దీ దేశ జీవితంలో ఓల్గా ప్రాధాన్యంహెచ్చింది.

రష్యన్ సమాఖ్య నదీ నౌకల మంత్రి జోసిం పష్కొవ్‌ను, ఓల్గా గురించి కొన్ని ప్రశ్నలకు జబాబు నివ్వమని కోరాము. మంత్రి చెప్పిన జబాబులు పాఠకులకు కుతూహల జనకంగా వుంటవన్న సమ్మకంతో, యింటర్వ్యూ పాఠాన్ని యిక్కడప్రచురిస్తున్నాము.

ప్రశ్న : దేశంలోని రవాణా మార్గాలలో ఒకదానిగా ఓల్గా నది ప్రాముఖ్యం ఏమిటి?

జబాబు : సోవియట్ దేశంలోని యూరోపియన్ భాగంలో, ఓల్గా అన్నిటికంటె పెద్ద జలమార్గం. 3,700 కిలోమీటర్లకు వ్యాపించి వున్న దీనికి 700 లకు పైగా ఉపనదులున్నాయి. ఈ నదీ మండలం ఎంతో పెద్ద ప్రదేశాన్ని ఆక్రమించి వుంది. ఇది భారతదేశపు భూభాగంలో సగానికి కాస్త తక్కువగా వుంటుంది.

అక్టోబరు విప్లవానికి ముందర, ఓల్గాపై నౌకాయానం చాలా పరిమితంగా వుండేది, వేసవిలో నీటిమట్టం ఎక్కువగా పడిపోవడంవల్ల.

సోవియట్ రాజ్య స్థాపన జరిగిన తరవాత చాలా పెద్ద జల విద్యుత్కేంద్రాలూ, లాకులూ యీ నదిపైని నిర్మింపబడ్డాయి. దాని నీటి మట్టాన్ని పెంచడానికి ఎత్తయిన డాములు నిర్మింప బడ్డాయి.

ప్రశ్న : ఏ కాలువలు ఓల్గాను, యితర నదీ మండలాలతో కలుపుతున్నాయి ?

జబాబు : విప్లవానికి ముందర, కాస్పియన్ సముద్రంలోనికి ప్రవహించే ఓల్గా ఒక కాలువగుండా బాల్టిక్‌తో మాత్రమే కలుపబడి వుండేది. మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో నిర్మింపబడిన తెల్ల సముద్ర—బాల్టిక్ కాలువ, దానిని తెల్ల సముద్రంతోకూడా కలిపింది. 1937 లో ఓల్గాను మాస్కోనదితో కలిపే ఒక లోతయిన కాలువ నిర్మింపబడింది. 1952 లో ఉపయోగంలో పెట్టబడిన ఓల్గా—డాన్ కాలువ డాన్ నది మీదుగా ఓల్గాను అజోవ్, నల్ల సముద్రాలతో కలిపింది. ఈ విధంగా యిప్పుడు ఓల్గా నౌకలు, సోవియట్ దేశపు యూరోపియన్ భాగంలోని ఐదు సముద్రాలలో దేనిలోనికైనా వెళ్ళవచ్చును.

ప్రశ్న : ఓల్గామీద పోయే ఓడల గురించి చెప్పండి ?



జబాబు: ఓల్గాపైని వెళ్ళే అధునాతన డిసెల్ ఓడల సంఖ్య ఎప్పుడూ పెరుగుతూనే వుంది. ప్రస్తుతం యీ నదిపైని 2,000 టన్నుల డిసెల్ ఓడలు నడుస్తూవుంటే, కొన్నాళ్ళలో 5 వేల టన్నులు మోసే డిసెల్ ఓడలు దానికి వస్తాయి. చాలా ఫ్రైటర్లు ఓల్గాపైని నడుస్తున్నాయి. నూనెను రవాణాచేసే ఓడలకు 12 వేల టన్నుల వరకూ మోసే టాంకర్లున్నాయి. ఇంతేకాకుండా మూడు డెక్కుల ప్రయాణీకుల డిసెల్ ఓడలు ఓల్గా మార్గంలో నడుస్తున్నాయి. ఈ నౌకాయానకాలం ఆఖరున సదుపాయమైన మూడు డెక్కుల డిసెల్ ఎలెక్ట్రిక్ ఓడలు, 2700 అశ్వశక్తి గలవి వస్తాయి.

ప్రశ్న: జలాంతర్భాగంలో పక్షాలుగల డిసెల్ ఓడ నిర్మాణంగురించి పత్రికలో వార్తపడింది. దాని ప్రత్యేక లక్షణాలేమిటి?

జబాబు: ఓడ యిప్పటికే నిర్మింపబడింది. దాని ఆకారం చిన్నది, వెనుక భాగంలో దానికి బలవత్తరమైన యింజిన్ వుంది. ఓడ కదిలేటప్పుడు, అది పైకిలేస్తుంది. ఓడ నిగుడిసున్న రెక్కలు యిందుకు తోడ్పడతాయి. దీని ఫలితంగా ఓడకు కనిష్టమైన ప్రతిఘటనవుంది, గంటకు 60-70 కిలోమీటర్ల వేగం పోతుంది.

రెక్కలుగల డిసెల్ నౌకను సోవియట్ డిజైనర్లు సృష్టించారు; గోర్కీ నౌకా నిర్మాణస్థావరంలో నిర్మింపబడింది.

ప్రశ్న: ఓల్గామీద యిప్పుడు ఏపని జరుగుతోంది?

జబాబు: స్టాలిన్‌గ్రాడ్ జలవిద్యుత్కేంద్రం నిర్మాణం పూర్తికావస్తోంది. సారతోవ్ మండలంలోని బలకోవో నగరం సమీపంలోని విద్యుత్కేంద్రం యిప్పటికే ప్రారంభింపబడింది. చెబొక్సరీ నగర సమీపంలో—యిదికూడా స్టాలిన్‌గ్రాడ్‌కు దిగువనే-ఒక విద్యుత్కేంద్రాన్ని నిర్మించడానికి ప్లాను చేయబడింది.

ఓల్గాపైని నౌకాయాన పరిస్థితులు బాగా అభివృద్ధి చేయబడతాయి. ప్రస్తుతం యీ నదిపైని, దాని ఉపనదులపైని తీసుకపోబడే బరువులు, సోవియట్ దేశంలోని జలమార్గాలలో యించుమించు సగంగా వున్నాయి. సంవత్సరానికి కోట్లాది టన్నుల కలప, నూనె, బొగ్గు, ముడిలోహాలు, ధాన్యం, ఉప్పు, సిమెంట్, ముడిపదార్థాలూ, యంత్రాలూ మొదలైన బరువులు ఓల్గా మీదుగా పంపబడుతున్నాయి.

వచ్చేఏళ్ళలో ఓల్గాపై నదీరవాణా చాలా హెచ్చుతుంది. ఇది ప్రపంచంలోని గొప్ప జలమార్గాలలో ఒకటవుతుంది.



క్యుబిషేవ్ సముద్రం మీద



← ఓల్గా నదిమీద ప్రయాణిస్తున్న రెక్కల ఓడ "రాకెట్"

# ఓల్గా నివాసిని

సిగ్మండ్ హిరెన్

లుకేరియా తెరెస్త్యేవ్నా క్రిట్ స్వకుటుంబాన్నీ, అనేకమంది మిత్రుల్నీ, ఉక్రెయిన్‌లోని రొసవ్‌కా నది వొడ్డునవున్న తన స్వగ్రామం కొజినోలోని తెల్లటి చిన్నచిన్న ఇండ్లనూ, అలజడి లేని ఆ గ్రామపు సుప్రశాంత వాతావరణాన్నీ విడిచి పరస్థలానికి వెళ్ళింది.

ఓల్గా మండలంలో ఆవిడ నివాసం ఏర్పరచుకొన్నది.... వృత్తి రీత్యా ఆవిడ జంతుశాస్త్ర ప్రవీణురాలు. ఈ జంతుశాస్త్ర సాంకేతిక ప్రవీణురాలు కాకపూర్వం ఆవిడ, యాంత్రిక శిక్షణ పూర్తి చేసుకొన్నది. తన ప్రాంతమంతటిలో ట్రాక్టరును నడిపిన మొటమొదటి యువతి ఆవిడే. ఆ తర్వాతకూడా విద్యాభ్యాసం చేసి, కీవ్‌లోని వ్యవసాయ పాఠశాలలో జంతుశాస్త్ర సాంకేతిక శిక్షణ ముగించుకొన్నది.

స్వీయ వృత్తిలో, స్వస్థలంలో పని చేసుకోకుండా ఆవిడ ఇంకొకదారి త్రొక్కవలసి వచ్చింది. యుద్ధం ప్రారంభమైంది, ఆమె భర్త యుద్ధరంగంలో హతుడయ్యాడు. శత్రువు తన గ్రామాన్ని సమీపిస్తు ఉగా, ఆవిడ బలవంతంగా స్వగ్రామం విడిచి, ఖాళీ చేయవలసి వచ్చింది. కాందిశీకు లందరితోపాటు, ఆమె ప్రయాణం చేస్తున్న రైలు ఒక ప్రక్కదారి పట్టింది. లుకేరియా తెరెస్త్యేవ్నాను, బండిలోని ఇతర కాందిశీకులనూ బెజైమైనై రైతులు తమతోపాటు ఆ గ్రామంలో ఉండవలసినదని కోరారు, మరీ వారు లుకేరియా తెరెస్త్యేవ్నా జంతుశాస్త్ర సాంకేతిక ప్రవీణురాలని తెలుసుకొని ఎంతో బలవంతం చేశారు. ఈ విధంగా, ఆవిడ ఓల్గా నదీ తీరానవున్న, బెజైమైనై గ్రామంలోని "జవెత్తై ఇల్యిచా" సమిష్టి క్షేత్రంలో తన పరిజ్ఞానాన్ని మొట్టమొదట వినియోగానికి తీసుక రాగలిగింది.

ఒక్క జంతుశాస్త్ర సాంకేతిక ప్రవీణురాలుగానే కాదు, అంతకన్నా అత్యున్నత స్థానాన్ని ఆక్రమించుకొన్నది. నిలకడైన పంటలకు, సమృద్ధమైన పశుగ్రాస సేకరణకు, గృహ నిర్మాణానికి అవరోధాలవుతున్న శక్తులను ఎదుర్కొని, ఆవిడ పోరాడవలసివచ్చింది. "జవెత్తై ఇల్యిచా" సమిష్టి క్షేత్రానికి పదివేల హెక్టర్ల సేద్యపుభూమి వుంది. ఒక్క ఆవులూ, గొర్రెల పెంపకంలోనే కాదు, అంతకన్నా ఆమె ఎన్నో విషయాలలో అనుభవజ్ఞురాలని గుర్తించిన రైతులు, సమిష్టిక్షేత్రానికి అధ్యక్షురాలిగా ఎన్నుకున్నారు. సమిష్టిక్షేత్రపు పంటను మూడురెట్లు అధికంచేసి, ఆదాయాన్ని 723,000 రూబుళ్ళనుంచి 2.5000,000 కు గత రెండేళ్ళలో ఆవిడ పెంచగలిగినట్టు, అంత అభివృద్ధిదాయకంగా కృషి చేయగలగడమన్నది తేలికైన విషయంకాదు.

ఓల్గా ప్రాంతంలో ప్రకృతి సిద్ధంగావున్న అవరోధాలకు తోడు, ఎన్నో అడ్డంకులను ఇతరత్రా ఆవిడ ఎదుర్కొనవలసి వచ్చింది. వాటిలో ఒకటి పనివారి కొరత. ఎంతో అసాధ్యమైన పరిస్థితులలోసైతం, ఆవిడ ప్రతిచోట పనివారికోసం వెతుకులాడుతుండేది. ఓల్గా మండలానికి రావాలని కుర్‌స్క్‌లో కొందరు అభిలాష పడుతున్నారని విని, ఆవిడ అక్కడికి వెళ్ళింది. తన "కుటుంబం ఎట్లా వుందో చూచి రావాలన్న" మిషతో, స్వస్థలానికి ప్రయాణంకట్టి, అక్కడ తోటి గ్రామస్తుల్ని తనతోపాటు ఓల్గా ప్రాంతానికి రమ్మని కోరింది. అసలు ఆమె ఓల్గా మండలంలోనే ఎంతో మానవశక్తిని సమీకరించ గలిగింది. ఎంతోమంది అనావశ్యకమైన పనులు చేస్తుండడం, కొందరు అసలు ఏపనీలేకుండా వుండడం ఆమె కనిపెట్టింది. ఒకసారి ఆవిడ పాల పనికత్తెలు అనేకులు, కొట్టాములో ఆవులపాలు పితుకుతుండడం, వీరిమీద ఒక కావలావాడు, చేతులూపుకుంటూ ప్రక్కప్రక్కల పచార్లు చేస్తుండడం చూచింది. ఏమిటి కావలావాడు చేస్తున్నపని? తన్నుతానే అర్థం చేసుకోని వ్యక్తి. అట్లాగే, గుర్రాల కాపరులనూ



తాజా రొట్టెను తరగుతుంటే ఎంతో సరదాగా వుంటుంది





లుకేరియా తెరన్‌త్యేవ్నాకు ఒక సమిష్టిక్షేత్రదారుడు, తను సాకుతోన్న గొర్రెపిల్లల్ని చూపుతోన్న దృశ్యం

కనిపెట్టింది. వేసంకాలమంతా గుర్రాలను బీళ్ళకు తోలితే, వాళ్ళసలుసు చేసే పనంటూ వుండదు

ఆ విధంగా పరిస్థితులను పరిశీలిస్తూ, సమిష్టిక్షేత్రపు పని పాటలకు మనుషుల్ని సంఘటిత పరచవలసిన సమస్యను లుకేరియా పరిష్కరించవలసి వచ్చింది.

సహజంగా, రైతులు తమకోసం మనసారా అపార శక్తి సామర్థ్యాలతో కృషిచేస్తూ, బహుముఖ పరిజ్ఞానాన్ని కలిగివున్న తమ అధ్యక్షురాల్ని క్రమంగా ప్రేమించి, గౌరవించసాగారు. సమిష్టి క్షేత్ర క్రియాశీలక సభ్యుల ఒక సమావేశానికి నేను హాజరయ్యాను. చర్చలు తీవ్రంగా ఉన్నాయి. లుకేరియా తెరెన్త్యేవ్నా తన అభిప్రాయాలను ఎప్పుడూ సభ్యులపైన రుద్దడంలేదు.

ఉక్రేనియన్, నికితా రైబల్‌చెన్కో, ఇప్పటి ఓల్గా సమిష్టి క్షేత్రపు ఒక దళాధిపతి అడిగాడు—"మనం విత్తనాలు కట్టాం, అయితే జొన్నపంట ఎందుకింత నాసిగావచ్చింది, చొప్పకూడా అంత మిశ్రమజాతికి చెందింది రాలేదు. కాగా మన వెయ్యి హెక్టర్ల భూమి యీ పంటక్రింద వుంది. చెయ్యిజారి, తరుణం తప్పిపోక మునుపే త్వరపడడం మంచిదికదా!"

పాడి పరిశ్రమ విభాగాధిపతి బోరిసోవ్, తన జేబులోనుండి దువ్వెనను తీసి, చెల్లాచెదరుగా వున్న తన క్రాపును కాస్త దువ్వుకున్నాడు.

"మనం శీతకాలంలో ఎంత పనిచేస్తామో, వేసంగిలోనూ అదేవిధంగా పనిచెయ్యాలి, అప్పుడే మనం ఎక్కువ పనిచేసిన వాళ్ళమవుతాం. మనకు తగినట్టు బీళ్ళులేవని వారంటున్నారు. అయితే ఈ ఆవుల్ని బీళ్ళలో మేపడం మానేమిటి? అక్కడ వాటికి చావళ్లు వెయ్యడం మానేమిటి?"

లుకేరియా తెరెన్త్యేవ్నా, పొడగరి, విశాల బాహువులతో, పొడవైన అద్దకపు దుస్తులలోవున్న ఆవ్యక్తి, ప్రతి సలహాను గమనంలోకి తీసుకొంటున్నది.

లుకేరియా తెరన్త్యేవ్నా జీవితగాధ, మా దేశ ప్రజల మధ్య విలసిల్లుతున్న మహత్తర మైత్రి యొక్క గాధ. యుద్ధం పరిసమాప్తమైనాకూడా, మనస్సు స్వగ్రామం మీదికి మళ్ళినాగూడా ఆవిడ రష్యన్ రైతాంగం మధ్యనే వుండిపోయింది.

ఆవిడ ఒకసారి, కొజినో గ్రామానికి కొద్దిదినాలు పర్యటనార్థం వెళ్ళినప్పుడు, ఆమెకోడలు "చూడు, నువ్వు స్వర్గసీమలాంటి మన పల్లెపట్టుకు ఆ మలమల మండే వేడి ప్రాంతం సాటి వస్తుందనుకొంటున్నావా! త్వరగా స్వగృహానికి తిరిగి వచ్చెయ్. ప్రతి వ్యక్తి నిన్ను స్మరించుకొంటారు, యుద్ధానికి పూర్వం జీవించినట్టు, మనం ఇప్పుడు జీవితం గడుపుకోవచ్చు...." నన్నది.

కాదు, లుకేరియా తెరెన్త్యేవ్నా క్రిట్ ఇంక మళ్ళీ ఇంటి ముఖం పట్టదు. భయంకరమైన యుద్ధ సమయంలో తన్ను ఆపదలో ఆదుకొన్న, ఆకలినుంచి తప్పించిన ప్రజలతోటే ఆమె నిలచిపోయింది. తనకు ఓల్గా ప్రజలు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం చెయ్యడానికే ఆవిడ అక్కడ వుండిపోయింది. ఇప్పుడు, వారామెను ఓల్గా నివాసిని అనే పిలుస్తారు. అవును, అక్షరాలా ఆమె ఓల్గా కాపురస్తురాలే!



స్వగృహంలో ట్రాక్టర్ డ్రైవర్ల మధ్యన వున్న లుకేరియా తెరెన్‌త్యేవ్నా

జ్ఞాపకార్థం ఒక ముఖ్య విషయాన్ని టూకీగా వ్రాసుకొంటూ





# అఫనసీ నికితిన్ ఫిల్మ్ నిర్మాణంలో





భారత, సోవియట్ సంయుక్త చిత్రనిర్మాణం "పరదేశి"లో ఫిల్మ్‌తార నర్గిస్

# కడపటి దృశ్యాలు

వి. మరెల్లోవా

పద్మవ్యూహంలాగా వున్న వరండాలగుండా పోయి పోయి, చిట్టచివరకు మాస్‌ఫిల్మ్ స్టుడియోలకు చెందిన, 4వ నెంబరు శబ్ద గ్రాహక విభాగాన్ని చేరుకొన్నాను. అక్కడ అఫనసీ నికితిన్ జీవిత ఘట్టాలు ఫిల్మ్ తీయబడుతున్నాయి. అదృష్టవశాత్తు, శబ్దగ్రాహక విభాగపు తలుపు తెరచివున్నది, నేను చటుక్కున లోపలికి జారుకున్నాను....

షూటింగు జరిగేటప్పుడు శబ్దగ్రహణ వేదిక దగ్గర ఏవిధంగా వుంటుందో ఇక్కడ ప్రతిదీ అదేవిధంగా ఉంది. దానిలో కొంత భాగం, ఒకసెట్టు, అడ్డంగా కనుపిస్తున్న ఒక చిన్న గుడిసె ఆక్రమించుకొని వుంది. సెట్టుకు చేరువలో ఫిల్మ్ డైరెక్టర్, వాసిలీ ప్రోనిన్ ఒక కుర్చీలో కూర్చొని వున్నారు. పలకలు పరచివున్న ఆ కుటీరపు చమను నేల మీద, అఫనసీ నికితిన్ వేషధారి ఒకడు పడుకొని వున్నాడు.

మీరే ఊహించండి, నా ప్రక్కనే నిల్చొని ఇంకొక అఫనసీ నికితిన్ కనిపించగానే నాకెంత ఆశ్చర్యం కలిగివుంటుందో! అతన్ని చూచినప్పుడు షూటింగులో పాల్గొంటున్నాడనిపించలేదు. అవును, అంతవాకా, వారు లైట్లను సరిచేస్తున్నారు. అదే అదునని, నేను తొందరగా ప్రోనిన్ను మొట్టమొదటి ప్రశ్న వేశాను.

"గుడిసెలో పడున్న వ్యక్తి, నటుడు కానే కాదు. అసలు నటుడికి ప్రతివేషం కట్టాడు" అంటూ ప్రోనిన్ పకపక నవ్వారు.

15వ శతాబ్దంలో భారత దేశాన్ని పర్యటించి, అక్కడ అనేకులతో మైత్రి కల్పించుకొని, ఐరోపా వాసులకు ఆ దేశ నిజపరిస్థితుల చెప్పడానికి తిరిగివచ్చి, రష్యా మున్ముందు ఆ దేశంలో వర్తకం చెయ్యగలదని భావించిన నిర్భయుడైన ఆ రష్యన్ వర్తకుని పాత్ర ధరించిన నటుణ్ణి, నేను పరికించి చూశాను.

ఒక పాత్రకు ప్రతిపాత్రధారి ఫిల్ములో నిర్వర్తించవలసిన విధులేమిటో నేను తెలుసుకోవాలనుకున్నాను.

"ప్రతి పాత్రీకరణంలో కొత్త ఏమీ లేదు" అని నాకు ప్రోనిన్ చెప్పారు. "విదేశాలలో ఫిల్మ్ నటులకు, షూటింగు సన్నాహాలప్పుడు, వారికి అలసట కలగకుండా తోడ్పడానికి ప్రతిపాత్రధారులుంటారు.

"అఫనసీ నికితిన్‌కు సంబంధించిన మన సంయుక్త సోవియట్-భారతీయచిత్రం విస్తృతంగా ప్రదర్శించడానికి, సాధారణమైన స్క్రీన్లన్నింటికీ అనువుగా తయారుచేయబడు



తున్నది. భిన్నభిన్న ఘట్టాలకు కనీసం ఒక్కొక్కదానికి నలుగురు ప్రతిపాత్రధారులు ఉండాలి. అంటే ప్రతి దృశ్యాన్ని నటుడు, కెమేరాముందు ఎనిమిదిమాట్లు నటించాలన్న మాట."

"మరి భారతీయ నటుల మాటేమిటి? మీరు వారిపట్లకూడా ఇట్లాగే కఠినంగా వర్తిస్తారా?" అని నేనడిగాను.

"భారతీయ నటులు పనికి బాగా అలవాటు పడ్డారు. వారు, వారిపాత్రల నిర్వహించడంలో ఎంతో కష్టపడి పనిచేస్తారు. భారత దేశంలో ప్రతిపాత్రధారు లుండే సంప్రదాయం లేదు. షూటింగ్ జరిగేటప్పుడు నటునిలో ఏమాత్రం తొట్రుపాటు కనుపించదు. ఈ విషయంలో వారు, సుశిక్షితమైన నటనకు మనకొక మంచి ఉదాహరణను చూపించారు. ఉత్కృష్టమైన ప్రతిభను చూపించి వారు మనల్ని ఎంతో ఆనంద పరచారన్న విషయం వేరే చెప్పక్కర్లేదు."

"మీకు వారితో ఆసక్తిదాయకమైన వాదోపవాదాలు జరిగి వుండొచ్చు. వాటిని కాస్త ప్రస్తావిస్తారా?"

"వాదోపవాదాలకేం? కళాకారుల మధ్య, ముఖ్యంగా మన సమాజంలాంటి ఒక అసాధారణ సమాజంలో అవి ఎప్పుడూ తలయెత్తుతుండేవే. భారతీయులకు, రష్యన్లకూ సినిమా కళపట్ల విశిష్టమైన విభిన్న దృక్పథాలున్నాయి. ఉదాహరణకు, మనం ప్రతిదృశ్యంలోని సందేశానికే, బలవత్తరమైన, రమణీయమైన దృశ్యాత్మకతకు ఒక్కొక్కప్పుడు హానికరమైనప్పటికీ ఎక్కువ ప్రాముఖ్యాన్ని యిస్తాము. మరో వైపు, మన స్నేహితులు, ఒక్కొక్కమాటు, దృశ్యపు బాహిర ప్రయోజనాలకు ఎక్కువ ప్రాముఖ్యాన్నిస్తారు. ఇక్కడ చర్చకు ఎంతో చోటు వుంది....

"వాద ప్రతివాదాలు ఎంతో తీవ్రంగా చెలరేగినప్పటికీ, ఎప్పుడూ మేము, ఉభయులకూ సంతృప్తికరమైన సాధనను అన్వేషించగలిగే వాళ్ళం."

"మరో విధంగా చెప్పాలంటే, మీరు మీ సంయుక్త కృషి జ్ఞానవర్ధకంగానే గాక మనోహరంగా వుందంటారా?"

"అవును. అంతేగాక ఖ్వాజా అహమ్మద్ అబ్బాస్ ఆధ్వర్యం వహిస్తున్న ఈ భారతీయ నట బృందంలో మాకు ఎందరో కొత్తగా స్నేహితు లయ్యారు. అసలు అదొక ప్రధాన విషయం."

"మీ చిత్రం ఎప్పుడు పూర్తవుతుంది?" అని నేను ప్రోనిన్ను అడిగాను.

"ఓహో, చేయవలసిన పని ఇంకా ఎంతో వుంది. త్వరలో ప్రకృతి దృశ్యాలను తియ్యడానికి ఓల్గాకు పోతున్నాం. మూడు దళాలుగా మేమంతా విభాజితమైనాము. మొదటి దళం త్వేర్‌నుంచి అఫనసీ నికితిన్ పర్యటనార్థం తరలివెళ్ళే దృశ్యాన్ని షూట్ చేస్తుంది. భారత దేశపు సుప్రసిద్ధ నటుడు జైరాజ్, ఈ దళంలో వెళ్తున్నాడు, ఆయన రాయబారి షిర్వాన్ హసన్‌బెక్ పాత్రను ధరిస్తాడు. అఫనసీ నికితిన్ ఆయన్ను, నొవాగొరోద్‌లో కలుసుకుంటాడు. తుర్కమేనియాకు రెండవ దళం వెళ్లి, పెర్షియాగుండా వెళ్ళిన అఫనసీ నికితిన్ ప్రయాణపు ఎడారి దృశ్యాలను తీస్తుంది. అబ్బాస్ ఆధ్వర్యం వహిస్తున్న మూడవదళం, ఇక్కడే వుండి, పద్మినీ నృత్య దృశ్యాలను ఫిల్మ్ చేస్తుంది.

"చిత్రంలో ఎన్నో భారతీయ నృత్యాలు, పాటలుగాక ఒక రష్యన్ వివాహంకూడా వుంటుంది. ఇప్పటికిప్పుడే, నేను మీకు చిత్రాన్ని ఎప్పుడు పూర్తిచేస్తామో చెప్పలేను. కానీ, మేము ఇప్పుడు తీసేవన్నీ చిత్రపు కడపటి దృశ్యాలు."

"పరదేశి" ("అఫనసీ నికితిన్" చిత్రంలో ఒక సెట్టు



# మాండలిక ఆర్థిక సమితి

**మార్క్ పాప్లావ్‌స్కి**

ఒక్క జలమార్గంగానే కాక, విద్యుచ్ఛక్తి. నూనె, లోహ, యాంత్రిక, వినియోగ వస్తూత్పాదక కేంద్రంగానూ ఓల్గా ప్రాముఖ్యం వహిస్తున్నది. ఓల్గా ప్రాంతంలో ఆధునిక పరిశ్రమలున్న అనేక ఆర్థిక పాలక మండలా లున్నాయి. వాటిలోని ఒక మండలాన్ని — ఇటీవల స్టాలిన్‌గ్రాడ్ ఆర్థిక మండలం అన్న పేరుతో, ఆ మండల సరిహద్దులలోనే రూపొందించబడిన దానిని మనంసందర్శిద్దాం.

భారీ పరిశ్రమ, ఈ మండలపు ప్రధాన పరిశ్రమ. ఈ ఆర్థిక మండలపు ఉత్పత్తిలో, నాల్గింట — మూడు వంతులు భారీ పరిశ్రమకు సంబంధించినది. అందుచేతనే ఇది, మండల ఆర్థిక వ్యవస్థలో ప్రముఖ స్థానం ఆక్రమిస్తున్నది. మండల పారిశ్రామికోత్పత్తిలో ఉక్కు, రోడ్డ సామగ్రి, ట్రాక్టర్లు, సరుకుల రవాణాచేయు డీసెలు ఓడలు, ఎక్స్కవేటర్లు, స్వయంచోదక క్రేన్లు, నూనెతీత యంత్రాలు, నూనె, సిమెంట్, పాదరక్షలు, వస్త్రాలు, తినుబండారాలు మొదలైన వస్తువులున్నాయి. 1960 కల్లా, స్టాలిన్‌గ్రాడ్ మండలం, సోవియట్ దేశమంతటిలో ఉత్పత్తి అవుతున్న ట్రాక్టర్లలో రమారమి మూడవవంతు ఉత్పత్తి చేయగలుగుతుంది.

పారిశ్రామిక, నిర్మాణక నిర్వాహక నవీన ప్రాదేశిక విధానాన్ననుసరించి ఈ మండలం ఇప్పుడు, ఒక ఆర్థిక సమితి ఆధ్వర్యంక్రింద ఉంటుంది. గత మూడు మాసాలనుండే ఈ సమితి పనిచేస్తున్నప్పటికీ. ఈ స్వల్పకాలంలోనే, నవీన నిర్వహణ పద్ధతులు ఉత్తమ ఫలితాల నిచ్చాయి. గతంలో, ఈ మండల పరిశ్రమలు, సోవియట్ దేశ, సోవియట్ రిపబ్లిక్కులకు చెందిన 43 మంత్రాంగాల, సంబంధిత శాఖల పర్యవేక్షణలో ఉండేవి. ఈ పరిశ్రమలన్నీ ఒక దానినుండి మరొకటి శాఖా విభాగాల అవరోధాలవల్ల విడివడి, వాటి ఉత్పాదక శక్తి పరిపూర్ణ వినియోగానికి రాక పరిమితమై వుండేవి. దీనివల్ల ఉత్పాదనలో ప్రతి వస్తూత్పాదన జరగడం మాత్రమేగాక, ఉత్పాదక సాధ్యతల, ఆర్థిక సాధనల సమన్వయం తగినంతగా జరగక కొరవడింది.

ఇప్పటి పరిస్థితి దీనికి భిన్నమైనది. ఎందువల్లనంటే మాండలిక పరిశ్రమలన్నీ ఒకే ఒక ఆర్థిక సమితి పర్యవేక్షణలో ఉన్నాయి. ప్రస్తుతం, దాదాపు 250 భారీ కర్మాగారాలకు, మిల్లులు, నూనెగనులు, మొదలైన వాటికి; మొత్తంమీద ఏడాదికి 5,500మిలియన్లరూబుళ్ల విలువైన వస్తువులను సమిష్టిగా ఉత్పత్తి చేస్తున్న పరిశ్రమలకు ఆర్థిక సమితి ఆధ్వర్యం వహిస్తున్నది. నూతన నిర్వహణ విధానం, నవీన ఉత్పాదక సాధనలను సంఘటిత పరచుటలో ఎంతో ఉపకరించినందువల్ల, ఈ మండలం 1960 కల్లా, అంటే ఆరవ పంచవర్ష ప్రణాళిక కడపటి సంవత్సరానికల్లా తన ఉత్పత్తిని ఇనుమడింప జేయడానికి వీలు కలుగుతున్నది.

స్టాలిన్‌గ్రాడ్ ఆర్థిక మండలానికి చెందిన పరిశ్రమలు తమ అర్ధ-సంవత్సర ఉత్పాదక ప్రమాణాలను 104.4 ప్రతిశతి అధిగమించాయి. 1956 నాటి అదేకాలపు ఉత్పత్తికన్నా, ఈ ఉత్పత్తి మొత్తం 13 ప్రతిశతి అధికమైంది. కార్మిక ఉత్పాదక స్థాయిని పెంపొందించటానికి నిర్దేశించబడిన లక్ష్యాలు కూడా అధిగమించబడ్డాయి. ప్రధాన నిర్మాణాలకు సంబంధించిన అర్ధ సంవత్సర ప్రణాళిక కూడా విజయవంతంగా ముగించబడింది. గృహ నిర్మాణానికి సంబంధించిన పథకం కూడా అంచనాల మేరకు పైగా అమలుపరచబడింది. ఇదంతా, గత నిర్వహణ పద్ధతి ప్రకారం వుండే సిబ్బందికన్నా అతితక్కువ సంఖ్య కలిగిన స్వల్ప సిబ్బందితోటి సాధించబడినదని కూడా గమనించవలసి వున్నది.

పరిశ్రమ అంతా అయిదు శాఖోపసంఘాలుగా విభాగితమైంది. నిర్మాణ కార్యనిర్వాహణానికి ఒక ఉపసంఘం ప్రత్యేకంగా ఉన్నది, ఇది సమిష్టిగా 46 నిర్మాణ కార్యక్రమాలను పర్యవేక్షిస్తున్నది. అదనంగా సరఫరా పంపిణీల పర్యవేక్షిస్తున్న మరొక ఉపసంఘం, ఆవశ్యక ద్రవ్యసాధనల పర్యవేక్షిస్తుంటుంది.

శ్రామిక ప్రజ ఆర్థికసమితి కార్యకలాపాలలో విస్తృతంగా పాల్గొంటున్నారు. ఆర్థిక సమితికి అనుబంధితమైన ఒక సాంకేతిక ఆర్థికసంఘం వున్నది. దీనిలో సమితియొక్క ఉన్నతాధికారులూ, పరిశ్రమల నిర్వాహక ఇ ర్గాలకు చెందినవారూ. శాస్త్రజ్ఞులూ, ఉత్పాదక నిపుణులూ, ఉన్నత పారిశ్రామిక వేత్తలూ, ప్రజా సంస్థల పరిశోధనాలయాల అధిపతులూ సభ్యులుగా వుంటారు.

ఆర్థిక సమితి విధులు బహుముఖమై వున్నాయి, కాగా దాని బాధ్యతలూ గురుతరమైనవి, నిర్వహణ స్థాయి పూర్వంకన్న ఇప్పుడు పెంపొందింది, సమస్యలన్నీ సత్వరం పరిష్కరించబడుతున్నాయి. దీనికి హేతువు. ఆర్థిక సమితి ఇదివరలోని మంత్రాంగ శాఖలకన్న ఉత్పత్తితో సన్నిహిత సంబంధాలను కలిగివుండడమే.

# 50 మహత్తర సంవత్సరాలు

సోవియట్ ప్రజలకు, ఇది ఉత్సవ సంవత్సరం. నవంబర్లో మహత్తర అక్టోబరు విప్లవ 40వ వార్షికోత్సవాన్ని జరుపుకొంటారు. దేశవ్యాప్తంగా జరుగనున్న ఈ మహోత్సవ సన్నాహ కార్యకలాపాలు అప్పుడే ప్రారంభమైనాయి. నగరాలలోని. గ్రామీణ ప్రాంతాలలోని శ్రామిక ప్రజలు, కర్మాగారాలలో, ఫాక్టరీలలో, సమిష్టి క్షేత్రాలలో, ప్రభుత్వ క్షేత్రాలలో పనిచేస్తున్నవారు, ఈ ఉత్సవాన్ని మహోన్నత సముచిత రీతిని జరుపుకోవడానికి శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తున్నారు.

ఈ మహోత్సవ సన్నాహసంబరాల మధ్యన ఇంకొక ప్రధాన దిన ప్రాముఖ్యాన్ని విస్మరించలేదు —ఆగస్టు మాసంలో సోవియట్ కార్మిక సంఘాల 50వ జన్మదినోత్సవం జరిగింది.

పరిశ్రమలలోను, సంస్థలలోను, ఫాక్టరీలలోను, కార్యాలయోద్యోగులందరూ; విజయానికి, సోవియట్ అధికారం సుపటిష్టం కావడానికి ఎంతో తోడ్పడిన తమ విస్తృత ప్రజాసంస్థ యొక్క వార్షికోత్సవాన్ని జరుపుకొన్నారు.

రష్యాలో కార్మిక సంఘాలు, 1905–1907 విప్లవ పోరాటాల మధ్యకాలంలో నెలకొల్పబడ్డాయి. నిరంకుశత్వానికి, జారిజానికి, పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా అవి ఎడతెగని పోరాటం సాగిస్తూన్న గడ్డురోజులలో, సమ్మెలనుప్రారంభించి, ప్రదర్శనలుజరిపి కార్మిక ప్రజల హక్కులను నిలబెట్టడానికి, సమ్మెకట్టినవారికి ఆర్థికంగాను, ఇతరత్రాను ఎంతో సహాయ పడ్డాయి. 1917, తీవ్ర పోరాట సమయంలో, మహత్తర అక్టోబర్ సోషలిస్ట్ విప్లవ విజయ సాధనలో, కార్మిక సంఘాలు, సమరరంగాన అగ్రశ్రేణులలో బారులు తీరాయి. కార్మిక ప్రజల అధికారం నెలకొల్పబడినతర్వాత, అవి, పారిశ్రామిక, రవాణా, వర్తక, సాంస్కృతిక, విద్యాసంస్థలకు స్వాస్థ్యత కల్పించుటలో ఉజ్వలపాత్ర ధరించాయి.

సోవియట్ దేశ చరిత్రలోని వివిధ ఘట్టాలలో, జాతీయ ఆర్థిక వ్యవస్థను పునరుజ్జీవింపజేయుటలోను.దేశ మొత్తాన పారిశ్రామికీకరణ, వ్యవసాయ సమిష్టీకరణల ప్రవేశ పెట్టుటలోను, పంచవర్ష ప్రణాళికల అమలు పరచిన సంవత్సరాలలోను, కార్మిక సంఘాలు ఒక మహత్తర పాఠశాలగా వుండేవి ఫాక్టరీ, కార్యాలయ కార్యకర్తలలో సోషలిస్టు సరళిని పరస్పరం తమతమ, కృషిలో అధికమించాలనే ఆకాంక్షను ప్రజ్వరిల్లచేస్తూ యంత్రాలవల్ల కలిగే ప్రమాదాల నుండి రక్షణ సూత్రాలను పరిశ్రమల నిర్వాహకులు అమలు పరుచుటను పర్యవేక్షిస్తూ, కార్మిక చట్టాలు అనుసరించబడేట్టు, సమిష్టి ఒప్పందాలు పాటించబడేట్టు వ్యవహరిస్తూ అవి, ఎల్లప్పుడూ కార్మికుల హక్కులను, ప్రయోజనాలను పరిరక్షిస్తుంటాయి.

సోవియట్ కార్మిక సంఘాలే, సాంఘిక భద్రతకు సంబంధించిన కార్యకలాపాల నిర్వర్తిస్తూ. కార్మిక ప్రజలకు ఆరోగ్య మందిరాలలోను. విశ్రాంతి గృహాలలోను వసతులను యిస్తూ. విరామ సమయాల్లో కాలక్షేపానికి ఏర్పాట్లు చేస్తున్నాయి. ప్రతి సోవియట్ కర్మాగార, కార్యాలయోద్యోగీ కార్మిక సంఘాల ప్రోత్సాహ సహకారాల పట్ల చిన్నచిన్న విషయాలలోనేమి, పెద్దపెద్ద విషయాలలోనేమి పనిలో వున్నప్పుడూ. ఇంటిపద్దా సానుభూతి కలిగివుంటాడు. అందుచేత కార్మిక సంఘాలలో 470 లక్షలకు పైబడిన ప్రజ సభ్యత్వాన్ని కలిగి వుండుటలో, ఆశ్చర్యపడవలసినదేమీ లేదు. దేశంలోని కార్మిక ప్రజా సంస్థలన్నింటికన్న ఇది పెద్దది.

కార్మిక సంఘాల అఖిల సమాఖ్య కేంద్రసమితి ప్లీనరీ సమావేశం. స్వర్ణోత్సవ సందర్భంగా, మాస్కోలో వైభవోపేతంగా జరుపబడింది. సోవియట్ ప్రజలతోపాటు — అగ్రశ్రేణి కార్మికులు, కార్మికసంఘ క్రియాశీలక సభ్యులు, పరిశ్రమల నేతలు, ఇంజనీర్లు, శాస్త్రజ్ఞులు; ఐరోపా. ఆసియా, అమెరికా, దేశాల కార్మిక ప్రజా ప్రతినిధులు సమావేశ కార్యక్రమాలలో పాల్గొన్నారు.

కార్మికసంఘాల అఖిల సమాఖ్య కేంద్రసమితి అధ్యక్షుడు వి. గ్రిషిన్, సోవియట్ దేశ శ్రామిక ప్రజల భావాలను వ్యక్తీకరిస్తూ, సోవియట్ దేశ కార్మిక సంఘాలు, ముమ్ముందుకూడా జాతీయార్థికాభివృద్ధికీ. జాతీయ సంక్షేమాభ్యున్నతికీ, కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికీ పోరాటాన్ని కొనసాగించగలవని ఉద్ఘాటించారు.

ప్రపంచ కార్మికసంఘ సమాఖ్య కార్యదర్శి, లూయీ సెయ్లెన్. చైనా కార్మికసంఘ సమాఖ్య ఉపాధ్యక్షులు. ల్యూ ఛాంగ్ షెన్, ఫ్రాన్సు. చెకొస్లొవాకియా, హంగరీ, యుగొస్లావియా దేశాల కార్మిక సంఘాల ప్రతినిధులు, అరబ్ కార్మికసంఘ సమాఖ్య ప్రతినిధులు. తదితర దేశాలనుంచి విచ్చేసిన ప్రతినిధులు ప్లీనరీ సమావేశంలో మాట్లాడుతూ కార్మికవర్గ అంతర్జాతీయ సమైక్యతను పెంపొందించి పటిష్టం చేయడంలోను. ప్రపంచమంతటా శాంతిని బలపరచటానికి, పోరాటం సాగించుటలోను సోవియట్ కార్మికసంఘాలు నిర్వర్తించిన మహత్తర పాత్రను ప్రశంసించారు.




కార్మిక సంఘాల అఖిల సమాఖ్య కేంద్ర సమితి, ప్లీనరీ సమావేశం, సోవియట్ దేశ కార్మిక సంఘ స్వర్ణోత్సవ సందర్భంగా, కార్మిక సంఘ భవనం "హౌస్ ఆఫ్ కాలమ్స్"లో ఇది గింది. కార్మిక సంఘ క్రియాశీలక సభ్యులు, పార్టీ ప్రతినిధులు, ప్రజా. ప్రభుత్వ సంస్థల ప్రతినిధులు, విదేశ ప్రతినిధులు, ఈ సమావేశంలో పాల్గొన్నారు.

"కార్మిక సంఘాల అఖిల సమాఖ్య కేంద్ర సమితి అధ్యక్షుడు, వి. గ్రిషిన్ సమావేశంలో ఉపన్యసిస్తోన్న దృశ్యం.

ఛాయాచిత్రకారుడు: వి. ఇగొరొవ్.

# రొజ్నెకోవ్ కుటుంబం

« మా విలేఖరి »

రొజ్నెకోవ్ కుటుంబం చాలా పెద్దది, పురాతనమైనదీను. 60 మందికి మించి ఉన్నారు ఆ కుటుంబానికి చెందినవారు. ఇప్పుడు వివిధ ప్రదేశాల్లో ఉంటున్నారు. ఈ కుటుంబం యొక్క ప్రత్యేకత యేమీలేదు. అందులో మహావీరులెవ్వరూ లేరు. ఎవ్వరూ గొప్ప పేరు ప్రఖ్యాతులను పొందలేదు. వేరేవిధంగా చెప్పాలంటే అది ఒక సర్వసాధారణమైన సోవియట్ కుటుంబం. ఆ కుటుంబానికి గ్రిగోరీ ఎన్. రొజ్నెకోవ్ పెద్ద. అరవై నిమిది సంవత్సరాల వయస్సువాడైన యీయన యీ మధ్యనే పెన్షన్ పుచ్చుకున్నాడు. పాతప్రపంచానికీ, నూతన ప్రపంచానికి మధ్య కొలికిపంటివాడతడు. దయ, చిరునవ్వు తొణికిసలాడే అతని కంఠధ్వనివెనుక ఎన్నెన్నో స్మృతులు — మధురమైనవీ, బాధాకరమైనవి కూడా — దాగిఉన్నాయి। తన కుటుంబం చరిత్రనంతా అతడే నాకు చెప్పాడు.

## విప్లవానికిపూర్వపు పరిస్థితులు

ఈ కుటుంబీకులను విప్లవానికిపూర్వం ఎవరైనా కలుసుకొని ఉండినట్లయితే వారి దుఃఖభాజనమైన జీవితాన్నిగురించి — పుట్టుకలు, చావులు, వ్యాధులు, ఆకలి, కాయ్యనాగలితో వెన్నెముక విరిగేట్టు పనిచేస్తూ జీవితం వెళ్ళబుచ్చుతున్న కథను గురించి-తప్ప మరేమీ వినిఉండేవారుకాదు. వారంతా రైతులుగా ఉంటుండేవారు. ఒకప్పుడు భూస్వాముల ఆస్తిలో ఒక భాగంగా ఉండిన వారి పూర్వీకులు పశువుల్లాగే అమ్మబడడానికి వీలుండేది. సూర్యోదయమయించాడంటే పని మొదలన్నమాట. మళ్ళీ సూర్యుడస్తమిస్తేనే పనికి విరామం. అటు తర్వాత దొరికిన ఆ కొద్ది విరామసమయంలో అలసిన శరీరానికి విశ్రాంతి నివ్వడం తప్ప మరేమీ ఉండేదికాదు. పురుషులుపొలాల్లో బానిసల్లా పనిచేస్తుంటే స్త్రీలు ఇండ్లల్లో బానిసల్లా పనిచేస్తుండేవారు. పుట్టినపిల్లల్లో మగవారు తండ్రుల అడుగు జాడల ననుసరించి పొలాల్లో పనికివెళ్ళేవారు. లేకపోతే పొట్ట చేత్తో పట్టుకొని మరెక్కడికైనా వెళ్ళిపోయేవారు. ఆడపిల్లలకు తమ కుటుంబంలాంటి మరేదో ఒక కుటుంబంలో ఎవరితోనో పెండ్లి జరిగిపోయేది. యుగయుగాలుగా ఒకేవిధంగా గడుస్తున్న ఆ స్త్రీల జీవితాల్లో మార్పేమీ వుండేదికాదు. వైద్య సౌకర్యాలుగాని, ప్రసూతి హాస్పటళ్ళుగాని, సాంఘిక సంక్షేమ కేంద్రాలుగాని ఉండేవికావు.

కాని, శతాబ్దాలుగా గడుస్తూ వచ్చిన అంధకార బంధురమైన యీ జీవితంలో, ఈ కుటుంబం యొక్క ప్రస్తుతపు యజమాని తండ్రి నికొలాయ్ ఫియోదరోవిచ్ రొజ్నెకోవ్ కాలంలో మార్పులు వచ్చాయి. ఆయన ఓకా తీరాన వున్న నిజిని నొవాగొరోడ్ మండలంలోని వెర్షినినో గ్రామంలో రైతుగా ఉంటుండేవాడు. అతని 78 సంవత్సరాల జీవితంలో యాభైరెండు సంవత్సరాలు తనపూర్వీకుల్లాగే గడిపాడు. ఆ తర్వాత విప్లవం జరిగింది। ప్రజాపీడన అనే ముసుగు, ముసికిగుడ్డ పారవేయబడినట్లు పారవేయబడింది. కాని అది అంతా తర్వాత జరిగిన సంగతి.



సమూనాలు తయారుచేసే ఆండ్రీ రొజ్నెకోవ్ (ఎడమ)

నికొలాయ్ రొజ్నెకోవ్ మార్ఫాఅనే ఆమెను పెళ్ళిచేసుకున్నాడు. ఆమెకు పన్నెండుగురు పిల్లలు కలిగారు. వారిలో నలుగురు బాల్యంలోనే చనిపోయారు. పెద్ద కొడుకు ఇవాన్ చిన్నప్పుడే ఇల్లువదిలి వెళ్ళిపోయాడు. అందుకు కారణం ఇంట్లోపోట్లాటగాని, పొలం పనంటే యిష్టం లేకపోవడంగాని కాదు. వాళ్ళకున్న కొద్ది పొలం అందరి భుక్తి గడపటానికి సరిపోలేదు. విద్యగాని, ఏదైనా వృత్తిలో నైపుణ్యంగాని లేక అతడు ఒకచోటునుండి మరొకచోటుకు తిరుగుతూ చిట్టచివరికి ఓల్గానదిపై నావికుడుగా చేరాడు. శీతకాలంలో నది పైభాగం గడ్డకట్టుకు పోయినప్పుడు తాను సంపాదించుకొన్న కొద్ది మొత్తం ఇంటికిపట్టుకొని వచ్చేవాడు. చిట్టచివరికి మొదటి ప్రపంచయుద్ధ సమయంలో సైన్యంలోకి బలవంతగా తీసుకొనబడ్డాడు. త్వరలోనే "మతం, జారుప్రభువు, పితృభూములకు" అసువుల నర్పించాడు.

## "కొత్త పునాదులమీద లేస్తుందిక ప్రపంచం...."

ఇప్పుడు కుటుంబానికి పెద్దగా ఉంటున్న గ్రిగరీ రెండవ కుమారుడు. అతడుకూడా అన్నలాగే యుద్ధంలోచేరాడు. కాని

అప్పటికల్లా పరిస్థితులు మారసాగాయి. అసలు యెందుకోగూడా తెలియకుండా, తమ ఇష్టానికి వ్యతిరేకంగా యుద్ధరంగంలో బలి గావింపబడుతున్న ప్రజానీకం మేల్కొనసాగింది.

అది 1917 వ సంవత్సరం. సైనికుల్లో కొత్త అభిప్రాయాలు ప్రబల సాగాయి. ప్రజల కష్టాలు అంతులేకుండా పెరిగిపోయాయి. ఇంతకాలంగా సంకెళ్ళు తగిలింపబడివున్న ఒక మహాశక్తి ఆ సంకెళ్ళను త్రెంచుకొనసాగింది.

"కొత్త పునాదులమీద లేస్తుందిక ప్రపంచం, శూన్యంగావున్న మనమే సర్వత్రా అనుశాసిస్తాం" అన్న నినాదం మారుమ్రోగింది. "సోవియట్లకు అధికారం, రైతులకు భూమి, ప్రజలకు శాంతి, ఆకలి గొన్నవారికి రొట్టె," అన్న బోల్షివిక్కుల నినాదం ప్రపంచమంతటా వినవచ్చింది. ఒకప్పుడు కలగా వుండి ఇప్పుడు నిజమవుతున్న యీ భావానికి గ్రిగొరి తన సర్వస్వాన్ని అంకితం చేశాడు.

అక్టోబరులో విప్లవం జరిగినప్పుడు గ్రిగొరి తన స్వగ్రామానికి చేరుకున్నాడు. యుద్ధం మూలంగా దేశంలో దారిద్ర్యం తాండవమాడ సాగింది. అరని గ్రామంకూడా ఆ దుస్థితికి లోనయింది: కరువు రాక్షసి విరుచుకు పడుతున్నది, గ్రిగొరి గ్రామ సోవియట్‌కు అధ్యక్షుడుగా యెన్నుకొనబడి, ధాన్యం ఖరీదు చేయడానికి రష్యా దక్షిణ ప్రాంతానికి పంపించబడ్డాడు. కాని వట్టిచేతులతో తిరిగివచ్చాడు, దక్షిణ మండలాలు, ఉరల్స్, సైబీరియా, క్యూబాన్‌లు విప్లవ ప్రతిఘాతకులు జోస్యందార్ల చేతుల్లో పడ్డాయి. అంతర్యుద్ధం ప్రారంభమయింది. మరొకసారి గ్రిగొరి తన సోదరులు అలెగ్జాండర్, ఆంద్రీలతో ఇల్లు వదలవలసి వచ్చింది. ఎర్ర సైన్యంలో చేరారు వారు. కాని పూర్వానికీ, యిప్పటికీ చాలా తేడా వున్నది. ఇప్పుడు వారు తమ ఇష్టానుసారమే ఎర్ర సైన్యంలో చేరారు. తమ భూమికొరకు, తమ స్వాతంత్ర్యం కొరకు, తమ ప్రభుత్వంకొరకు పోరాడుతున్నామని వారికి అర్థమయింది. ఎన్నో బాధలకు లోనయ్యారు. అయినప్పటికి తాము తమ ప్రయోజనాలకై పోరాటం కొనసాగిస్తున్నామన్న చైతన్యం వారి ధైర్యాన్ని చెదరనివ్వలేదు. పైగా అనేక వీరోచిత చర్యలను జరుపుతూ, విజయానికి దోహద మిచ్చారు. ...

## సోషలిజం నిర్మాణానికి రొజ్నెకోవ్ కుటుంబం

అంతర్యుద్ధం పూర్తయిన తర్వాత, అంతర్యుద్ధం వల్లా, అంతకు పూర్వం యుద్ధంవల్లా విధ్వంసమైపోయిన దేశాన్ని పునర్నిర్మించడం సమస్య ఎదురయ్యింది. కాని ఇప్పుడు కొత్త భావాల పునాదిపై యావత్తు ఆర్థికవిధానం పునర్నిర్మింపబడసాగింది. ఏ కొద్ది మందికో లాభదాయకంగా ఉండేటట్లు గాక, ప్రజలందరికి లాభదాయకంగా వుండేట్లు పునర్నిర్మాణం జరుగవలసి వచ్చింది. పరిశ్రమలు, వ్యవసాయం సోషలిస్టు విధానంలో నిర్మింపబడడం ప్రారంభమైంది. దోపిడి, దారిద్ర్యం లేని ఒక నూతనసమాజం, పాత సమాజంలోంచి ఉద్భవింప సాగింది.

గ్రిగొరీ తన సోదరులతోపాటు తిరిగివచ్చి స్వగ్రామంలో స్థిరపడ్డాడు. ఆ సమయంలో మార్కెటింగ్ సహకార సంఘాలు స్థాపింపబడసాగాయి. తాము ఉత్పత్తిచేసిన పంటను ఈ సంఘాల ద్వారా అమ్ముకొని, తమకు అవసరమైన వస్తువులను వాటిద్వారానే కొనుక్కోవడం లాభదాయకమని రైతులు గ్రహించారు. అది సోష



రొజ్నెకోవ్, తను పొదుపుగా నిలువచేసుకున్న ధనాన్ని, కర్మాగార నిర్వాహక వర్గంనుంచి గృహనిర్మాణానికని పొందిన 7,000 రూబుళ్ళనూ వినియోగించి నిర్మాణం చేస్తున్న పెద్ద ఇటుకల మేడపనులలో, ఆయనకు కుమారులు గెన్నదీ, వాలెరీలు సాయపడుతోన్న దృశ్యం





ఎలిజవెతా రొజ్కోవా, మోటారు నిర్మాణంలోని విశిష్టురాలైన గ్రైండర్

లిజానికి ఒకమెట్టు. గ్రిగోరీ తన జిల్లాలోని మొట్టమొదటి సహకార సహకార సంఘానికి అధిపతి అయ్యాడు. అటుతర్వాత, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల స్థాపన సమస్య వచ్చినప్పుడు, ఆయన వాటి యొక్క గొప్ప లాభాలను గుర్తించి, వాటిని స్థాపించి, అమలు జరపడానికి హృదయ పూర్వకంగా ప్రచారం చేశాడు.

ప్రథమ పంచవర్ష ప్రణాళిక సమయంలో ఇండ్లుకట్టే కార్మికుల కొరత యేర్పడింది. రొజ్కోవ్ కుటుంబీకులు ప్రభుత్వం విజ్ఞప్తి ననుసరించి ఇప్పుడు గోర్కీ నగరం అని పిలువబడుతున్న నగరానికి చేరుకున్నారు.పూర్వంవలె, తిండికిలేకగాదు.వారలా నగరానికి చేరింది. తమ దేశ పునర్నిర్మాణానికి యెంత సాధ్యమైతే అంతగా దోహద మివ్వాలన్న చైతన్యంతోనే నగరానికి చేరుకున్నారు. గోర్కీ నగ రానికి సమీపంలో కట్టబడిన ఒక చాలా పెద్ద మోటారుకార్ల నిర్మాణ యంత్రాగార నిర్మాణంలో వారు పాల్గొన్నారు. అక్కడి కార్మికులకు అహారం, తదితరవస్తువులు సరఫరాచేసే పని గ్రిగోరీకి అప్పజెప్పబడింది. అతని సోదరులు, ఇతర బంధువులు యంత్రా గారం, గృహాల నిర్మాణంలో వడ్రంగులుగా పనిచేశారు. ఈ విధంగా వారు నగరవాసులయ్యారు. కాని రొజ్కోవ్ కుటుంబీకులలో కొందరు మాత్రం తమ పూర్వ కులవృత్తిని వదలలేదు. తమ గ్రామంలోనే సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులుగా ఉంటున్నారు.

## అక్టోబరు విప్లవం వారికన్నీ సమకూర్చింది

ఇప్పుడా కుటుంబం అనేకరెట్లు పెరిగింది. గ్రిగోరీ ఇప్పుడు తాతఅయ్యాడు. తన తండ్రిని గురించి ఇప్పటికీ ఆప్యాయతతో తలుచుకొంటుంటాడు. ఆయన చాలాకాలం క్రితమే మరణించినప్ప టికి, జీవితంలో వచ్చిన యీ కొత్త మార్పులను చూచాడు. రొజ్కోవ్ కుటుంబీకులు వివిధ రకాలకు చెందిన వృత్తులలో ఉంటున్నారు. వారిలో దర్జీపనిచేసేవారు, ఉపాధ్యాయులు, సాంకేతిక నిపుణులు, మెషిన్ ఆపరేటర్లు, పశుపోషకులు, భాషాపండితులు, మొదలైనవారున్నారు. రొజ్కోవ్ కుటుంబంలో తాత ముత్తాతల నుండి వస్తున్నవృత్తి వడ్రంగం. సోవియట్ దేశంలో ప్రఖ్యాతి గాంచిన "పొబేదా" మోటారుకారు యొక్క కొయ్య నమూనాను తయారుచేసిన గౌరవం ఆంద్రీకి దక్కింది.

ఈ కుటుంబీకులలో కొందరిప్పుడు తమ స్వంత ఇండ్లను



పెద్దదైన "గోర్కీ ఆటో ప్లాంట్" యొక్క ఒక దృశ్యం
రొజ్కోవ్ కుటుంబపు ఇప్పటి పెద్ద, గ్రిగోరీ,
తన సోదరులతో దీని నిర్మాణానికి తోడ్పడ్డారు

ఫ్యాక్టరీ టెక్నాలజిస్ట్ యెవ్‌గెనీ రొజ్కోవ్





గ్రిగోరీ రాజ్నెకోవ్, ఆయన పత్ని వీరా, ఆయన కుటుంబమూ స్వగృహంలో ఉదయపు భోజనాల దగ్గర

నిర్మించుకొంటున్నారు. వారి బిడ్డలు పాఠశాలలకు వెళుతున్నారు. ఆ బాల బాలికలు తమకు యిష్టంవచ్చిన వృత్తిని అవలంభించడానికి అవకాశాలున్నాయి. అమాయకపు చిరునవ్వు వారి పెదవులపై చిందు లాడుతుంది. పుష్టికరమైన ఆహారము, చక్కని దుస్తులు లభిస్తు న్నాయి. వారి తలిదండ్రులు, ప్రభుత్వము వారిపై ప్రేమానురాగాలను కురిపిస్తూ, కావలసినవన్నీ చేకూరుస్తున్నారు. ఆడుకోడానికి కావలసిన బొమ్మలున్నాయి. జబ్బుచేస్తే డాక్టర్లు, నర్సులు శ్రద్ధ తీసుకొని వారికి తిరిగి ఆరోగ్యాన్ని కల్పిస్తారు. అందుకు వారి తలిదండ్రులు యేమీ ఖర్చుచేయ నవసరంలేదు. సెలవుల్లో తలిదండ్రులతో యాత్రలకు వెళతారు. లేదా ఆ సెలవులను బాలల వేసవి శిబిరాల్లో గడుపుతారు. వారికి తమ అభిమానులైన గ్రంథకర్తలు, నటీనటులు, సర్కస్ హాస్యగాళ్ళు వున్నారు.

వీధివాకిట్లో అవతల వున్న బావిదగ్గర, నీటికావడితో నాకెదురు వస్తున్న గ్రిగోరీ రాజ్నెకోవ్ చిన్నకుమార్తె షురా



ఈ బాలలకు, వారి తాత ముత్తాతలు వారి వయస్సులో వున్నప్పుడు యెలాంటి జీవితం గడుపుతూవచ్చేరో తెలియదు. వారి కుటుంబంలోని ముసలివారు యెవరైనా ఆనాటి కథలను చెబుతుంటే నిజమేనా అన్నట్లు ఆశ్చర్యపోతుంటారు. బాధలు, ఆకలి, దారిద్ర్యం, దెబ్బలు, ఎముకలను నుగ్గుచేసే కష్టమైనపని—వీటిని గురించి వింటుంటే వాళ్ళకు అదంతా మరొక ప్రపంచానికి సంబంధించిన కథ లాగ వుంటుంది. అప్పుడు ముసలి రాజ్నెకోవ్ కండ్లల్లో నీళ్ళు తిరుగుతాయి. కాని అవి దుఃఖం బాష్పాలుకావు. తమ కన్నీటిని చేకూర్చిన అక్టోబరు విప్లవంవల్ల సాధ్యమైన ఈ మార్పులకు తాము కూడా తమలాంటి లక్షలాది ప్రజలతోపాటు తమకు చేతనైనంత దోహదం చేశామన్న విషయం తలుచుకున్నందువల్ల రాలే ఆనంద భాష్పాలవి.

తాము యెన్నో కష్టాలు పడి ఆ దారిని గడచిన వచ్చామని ఆ ముసలాయనకు తెలుసు. నేడు తాము సాధించుకొన్న విషయాలు



రాజ్నెకోవ్ కుటుంబపు యువతరం: పాఠశాలలో చదువుతున్న స్వెత్లనా, ల్యూద్మిల్లా, లిదియాలు

యెంతో రక్తంచిందిన తర్వాత సాధ్యమయ్యాయని తెలుసు. దేశం అంతటికీ ప్రమాదాన్ని కల్పించిన గత యుద్ధం యొక్క ప్రభావం ఈ కుటుంబం మీదకూడా పడకపోలేదు. ర్నాజెకోవ్ కుటుంబీకులు యుద్ధపు భయంకరదినాలలో తాము సృష్టించుకొన్న విషయాలను పరిరక్షించుకోడానికి శత్రువుతో పోరాడి రక్తాన్నిధారబోశారు. గ్రిగొరీ తమ్ముడు విక్టర్ ప్రాణాల నర్పించాడు. అనాథులైపోయిన అతనిబిడ్డల నిద్దర్ని అంద్రీ పెంచుతున్నాడు. విక్టర్ చెల్లె భర్తనూ, కుమారుడ్నీ పోగొట్టుకొన్నది. యుద్ధం అంటే యేమిటో వాళ్ళందరికి బాగా తెలుసు. శాంతి నినాదం యొక్క ప్రాముఖ్యత తెలుసు. వారు హృదయ పూర్వకంగా దానిని బలపరుస్తున్నారు.



← బొంబసు ఫిరంగి దళ సభ్యులు బారు పెట్టివున్న దృశ్యం

★



సెవాస్తొపోల్లో జరిగిన ఒక వీధి పోరాటం →

# గడచిన దారి

ఎల్. పాపిన్, ఎం.ఎస్.సి. (చరిత్ర)

[అక్టోబరు విప్లవానంతరం సోవియట్ దేశ పురోభివృద్ధికి సంబంధించిన నాలగవ వ్యాసం యిది. మొదటి మూడు వ్యాసాలూ 'సోవియట్ భూమి' 16, 18, 19 సంచికలలో ప్రచురింప బడ్డాయి—సం.]

**1941** జూన్ 22న ఉదయం నాలుగు గంటలకు సోవియట్-జర్మన్ నిరాక్రమణ సంధిని ద్రోహబుద్ధితో భగ్నం గావిస్తూ. నాజీ జర్మనీ సోవియట్ దేశంపైని దాడి చేసింది. ఈ దాడి సోవియట్ ప్రజలను ఆశ్చర్య పరిచింది. సోవియట్ సేన సమీకృతమై లేదు; పరిశ్రమ యుద్ధోత్పత్తికి అనుగుణంగా మార్చబడలేదు. దీని ఫలితంగా, సంఖ్యా బలంలోనూ. టాంకుల. విమానాల సంఖ్యలోనూ ఆధిక్యతగల ఫాసిస్టు సేనలు, సోవియట్ సేనలు తీవ్రంగా ప్రతిఘటించినప్పటికీ, యుద్ధ ప్రథమదశలో పురోగమనాన్ని సాగించాయి; సోవియట్ దేశంలోని పెద్ద పారిశ్రామిక కేంద్రాలనూ, భాగ్యవంతమైన వ్యవసాయ మండలాలనూ ఆక్రమించుకున్నాయి.

సోవియట్ దేశంపైని దండయాత్ర చేయడంలో నాజీ జర్మనీ, ప్రపంచపు ప్రథమ సోషలిస్టు రాజ్యాన్ని నాశనంచేయడానికి ఆశించిన ప్రపంచ అభివృద్ధి నిరోధ కత్వానికి అగ్రగామిగా పని చేసింది. జర్మనీకి వ్యతిరేకంగా యుద్ధంలో అమెరికా, బ్రిటన్ సామ్రాజ్యవాదులను సరించిన లక్ష్యం, ప్రపంచ మార్కెట్లలో జర్మనీపోటీలేకుండా చేసుకోవడం; అదే సమయంలో హిట్లరైట్లు సోవియట్ దేశాన్ని బలహీన పర్చుతారని కూడా అవి ఆశించాయి. సెనెటర్ ట్రూమన్—యీయన తదుపరిని అమెరికాకు అధ్యక్షుడయ్యారు—జూన్ 24, 1941 న న్యూయార్క్ టైమ్స్ పత్రికలో యిలా నిష్కర్షగా వ్రాసేరు: "జర్మనీ జయిస్తున్నట్టుగా మనకు కనిపిస్తున్నట్టయితే, మనం రష్యాకు





లెనిన్‌గ్రాద్‌లో, శత్రు విమానాలమీద కాల్పులు చేస్తున్న
విమాన విధ్వంసక శతఘ్నులు

చారు, కాన్‌సంట్రేషన్ క్యాంపులలో తగులపెట్ట బడ్డారు, తుపాకు లతో కాల్చివేయ బడ్డారు, ఉరితీయ బడ్డారు.

తమ శాంతియుత జీవితాన్ని భగ్నం గావించి శత్రువులకు వ్యతిరేకంగా సోవియట్ ప్రజలందరూ ఐక్యంగా పోరాడేరు. ఫాసిజం నిర్మూలనం కోసమూ, స్వీయ దేశ స్వాతంత్ర్యంకోసమూ వారు పోరాడి, ఫాసిస్టు దాస్యంక్రింద అణగారుతోన్న యూరప్ ప్రజలందరికీ అదే సమయంలో, తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను సంపాదించుకునేందుకు తోడుపడ్డారు.

సోవియట్ దేశ జాతీయార్థిక వ్యవస్థను, కార్మిక కర్షకులు త్వరితగతిని యుద్ధోత్పత్తికి మార్చివేశారు. స్త్రీలూ, పిల్లలూ పని చేయడానికి ఫాక్టరీలకు వెళ్ళారు, పోరాడడంకోసం యుద్ధ రంగానికి వెళ్ళిన పురుషుల స్థానంలో యంత్రాలనునడిపేందుకు. "యుద్ధరంగం కోసం యిది అవసరం, యిది నెరవేర్చబడుతుంది !" అనేవారు సోవియట్ కార్మికులు, సైన్యంకోసం వస్తూత్పత్తి చేయమని ఆజ్ఞలు వచ్చేటప్పుడు, కొన్నికొన్ని వేళల్లో వారు ఆర్డర్లు పూర్తయ్యేవరకూ రోజుల తరబడిని ఫాక్టరీలలో వుండి పోయేవారు.

వందలాది పారిశ్రామికసంస్థలు ప్రమాదానికి లోనైన ప్రాంతాల నుండి, దేశపు లోపలి భాగంలోని సురక్షిత ప్రదేశాలకు తరలించబడ్డాయి. పదమూడు వందలకు పైగా పెద్ద పరిశ్రమలు ఉరల్స్‌కు, సైబీరియాకూ, యితర ప్రాంతాలకూ తరలించ బడ్డాయి. రైతులు పశుధనాన్ని, యంత్రాలనూ, ధాన్యాన్ని తరలించారు. 1941 చివరికాలం సోవియట్ పరిశ్రమలకు అతిగడ్డుకాలం. సోవియట్ దేశంలో పరిశ్రమలకు తీరని పెద్దదెబ్బతగిలిందని చాలమంది విదేశీ పరిశీలకులకు అనిపించింది. కాని1941 డిసెంబరు సరికే ఉత్పత్తిలో క్షైణ్యం అరికట్టబడింది. 1942 మార్చి ప్రారంభం సరికి అది త్వరత్వరగా పెరిగింది. బ్లాస్టు ఫర్నెసులు, ఓపెన్‌హార్త్ ఫర్నెసులు, ఫాక్టరీలు, విద్యుత్కేంద్రాలూ నిర్మించడం, యుద్ధానికి పూర్వపు పంచవర్ష ప్రణాళికలలో బలవత్తరమైన లోహ, యంత్ర నిర్మాణ కేంద్రం నిర్మింపబడిన ప్రాచ్య మండలాలలో ప్రారంభమైంది. సోవియట్ ప్రజల స్వార్థరహిత సేవవల్ల, నిర్మాణం అపూర్వమైన వేగంతో సాగింది.

యుద్ధరంగంనుండి చెడువార్తలువస్తున్నాయి. సోవియట్ సేన యింకా తిరోగమిస్తూనేవుంది. కాని ఎంత కష్టాలయినా, సోవియట్ ప్రజల విజయదీక్షను భగ్నంగావించ లేకపోయాయి. దేశ రక్షణ నిధి కోసం విరాళాల వసూళ్ళు యుద్ధప్రారంభం నుండీ సాగింది. సమిష్టి రైతు పెరపోంత్ గొలొవతి రెండు విమానాల నిర్మాణానికి తను దాచుకున్న ధనాన్ని విరాళం యిచ్చి, యుద్ధరంగంలోని వైమానికులకు స్వయంగా బహూకరించారు. యుద్ధ, శ్రమ రంగాలు రెండింటిలోనూ విజయదీక్ష ఒకే విధంగా దృఢంగా వుండేది.

★





ఉరల్స్ కర్మాగారపు కన్వేయర్
మీదనుండి సరాసరి యుద్ధరంగానికి



## బ్లిట్జ్‌క్రిగ్ వైఫల్యం

సోవియట్ దేశం పైని ఫాసిస్టులు తమ దండయాత్రను మొదలు పెట్టినప్పుడు, మెరుపువేగంతో తాము యుద్ధాన్ని జయిస్తామనీ, రెండు మాసాల్లో ఓల్గాను చేరుకుంటామనీ విశ్వసించారు. కాని ఫాసిస్టు సేనానాయకులు ప్లాను చేసిన వేగం కంటె జర్మన్ సేనలు పురోగమనవేగం చాలా తక్కువగా సాగింది.

తిరోగమించే సోవియట్ సేనలు, చుట్టుముట్టబడివున్నప్పుడు సైతం, సులభ విజయాలకు అలవాటుపడిన శత్రువులకు ఆశ్చర్య భయాలను కలిగించే పట్టుదలతోనూ, రౌద్రంతోనూ పోరాటం సాగించాయి. సరిహద్దు బ్రెస్ట్‌దుర్గపు చిన్న కాపలాసేన శాశ్వత కీర్తిని సంపాదించింది. ఒక నెలకుపైగా యీ దుర్గరక్షకులు ఒకపెద్ద నాజీ డివిజన్‌ను ఎదిరించి పోరాడారు. శత్రువుకు లొంగిపోవడం కంటె మరణించడమే మేలని వారు నిశ్చయించుకున్నారు, యించుమించుగా బ్రెస్ట్ వీరులందరూ యీ అసమాన పోరాటంలో నశించిపోయారు.

శత్రువులచే బాదింపబడే నగరాలలోని వారు, తమ రక్షకులకు సాయపడడానికి శాయశక్తులా పాటుపడ్డారు. 69 రోజులు సాగిన తమ వీరనగర రక్షణ పోరాటంలో సోవియట్ సేనలతో బాటుగా ఒడెస్సా పౌరులు కలసి పోరాడారు. సెవాస్తపోల్ వద్ద 250రోజులు సోవియట్ సైనికులు శత్రువుల దాడులను తిప్పికొట్టారు; లక్షలాది మంది ఫాసిస్టులు ఆ నగరం గోడల వద్ద హతులయ్యారు.

1941 ఆకురాలు కాలంలో జర్మన్ సేనలు లెనిన్‌గ్రాడ్‌ను సమీపించి, మిగతా దేశం నుండి దానిని ఛేదించాయి. ఆ నగరం పైని చేయబడిన చాలా దాడులు తిప్పికొట్టబడ్డాయి. వారి పురోగమనం పొలిమేరలలో అరికట్టబడింది. క్షుద్బాధ, దిగ్బంధం, ఎడతెరిపిలేని విమానదాడులు, శతఘ్ని కాల్పుల సహాయంతో ఫాసిస్టులు ఆ నగరాన్ని పట్టుకోవడానికి ప్రయత్నించారు. విద్యుత్కేంద్రాలూ, నీటిసరఫరా శత్రువులచే నాశనం చేయబడ్డాయి. నగరానికి నీళ్ళూలేవు, దీపాలూలేవు. ఆకలివల్ల, బాంబులవల్ల తుపాకిగుళ్ళవల్ల వేలకొలదీ లెనిన్‌గ్రాడ్ పౌరులు మరణించారు. కాని లెనిన్‌గ్రాడ్ పోరాటాన్ని సాగించింది. విప్లవ జన్మస్థలి అనబడే లెనిన్‌గ్రాడ్‌కోసం, మహాపురుషుడు లెనిన్ పేరును ధరించిన లెనిన్‌గ్రాడ్ కోసం దాని రక్షకులు గొప్పధైర్య సాహసాలతో పోరాడేరు. లెనిన్‌గ్రాడ్ వీరరక్షణ ఇంచుమించు రెండున్నర ఏళ్ళు. లేదా 900 రోజులు జరిగింది, శత్రువులు తిరోగమించవలసివచ్చినంతవరకూ.



విజయోత్సవ విన్యాసాలలో పాల్గొన్న సోవియట్ సైనికులు ఓడిపోయిన హిట్లరైట్ జర్మన్ పతాకాలను సమాధి ముందర పారవేస్తున్న దృశ్యం



నర్వా నదివొడ్డున మార్షల్ ఝుకోవ్, మార్షల్ రకొస్సోవ్‌స్కీ

1941 అక్టోబరులో హిట్లరుసేనలు మాస్కో చేరువకువచ్చాయి. తొందరలో విజయం లభిస్తుందన్న నమ్మకంతో హిట్లరు నవంబరు 7వ తేదీని, అక్టోబరు సామ్యవాద మహావిప్లవ వార్షికోత్సవ దినాన్ని, రెడ్‌స్క్వేర్లో ఫాసిస్టు సేనల విన్యాసానికి తేదీగా నిర్ణయించాడు. కాని ముందరివలెనే, యీ రోజున సోవియట్ సేనలు రెడ్‌స్క్వేర్లో, 1941 నవంబరు 7న తమ ఉత్సవదిన విన్యాసంకోసం బారులు తీర్చి నిలిచాయి. లెనిన్ సమాధికి ప్రక్కగా వెళ్ళిన సోవియట్ సైనిక దళాలు నేరుగా యుద్ధరంగానికి వెళ్ళాయి, తమ ముఖ్యపట్టణ రక్షణకు. ఏవిధంగానైనా సరే శత్రువును ఆపడానికీ, ఓడించడానికీ అవి ప్రతిజ్ఞచేశాయి. ఐదు లక్షలమంది మాస్కోవాసులు తమ నగరం పొలిమేరలలో రక్షణలను నిర్మించారు. ఆయుధధారణ చేయడానికి సమర్థతగల వారందరూ ప్రజా ఐచ్ఛిక సేవకదళాల్లో చేరారు. హిట్లరు ఆజ్ఞానుసారంగా ఫాసిస్టు సేనానాయకులు తమ సేనలు ఒకదానివెంబడి ఒకటిని దండయాత్రకు పంపారు. కాని లాభం లేకపోయింది. యుద్ధరంగంలోని ఒక భాగంలో జనరల్ పన్ఫిలోవ్ డివిజన్‌కు చెందిన 28 గార్డ్సుమెన్ శత్రువుల ఏభై టాంకులను గ్రెనేడ్లతోనూ, రైఫిళ్ళతోనూ ఎదుర్కొన్నారు. ఈ అసమానమైన పోరాటం నాలుగుగంటలు సాగింది. వారి శక్తి ఉడిగిపోతోంది, సోవియట్ సైనికులు తమ బెల్టుల్లో గ్రెనేడ్లను పెట్టుకుని శత్రువుల టాంకుల క్రిందికి వెళ్ళిపోయారు. ఈ వీరులు శత్రువుల టాంకులు పద్దాలుగింటిని నాశనం చేశారు. వారు మరణించారు. కాని ఫాసిస్టు టాంకుల శ్రేణి వెళ్ళలేకపోయింది.

డిసెంబరు ప్రారంభంలో సోవియట్ సైన్యాలు ఎదురుదాడి సాగించాయి. ఫాసిస్టులు పారిపోయారు తమ ఆయుధాలనూ, యుద్ధ సామగ్రినీ వదిలిపెట్టి. కొద్దికాలంలో సోవియట్ సేనలు పశ్చిమ ముఖంగా పురోగమించాయి. అవి గడచివెళ్ళిన దూరం కొన్ని కొన్ని స్థలాలలో 400 కిలోమీటర్లు దాటింది. హిట్లరైట్ దురాక్రమణదారులు యిక మాస్కోకు సమీపంగా రాలేకపోయారు. మాస్కో పొలిమేరల్లో చావుదెబ్బ కొట్టడం, రెండవ ప్రపంచ యుద్ధంలో ఫాసిస్టు సేనలు పొందిన మొదటి పెద్ద పరాజయం. తమ సైనికులలోనూ, బానిసలు గావింపబడిన ప్రజలతోనూ హిట్లరైట్లు అదేపనిగా ఫాసిస్టు సేన అజేయమైనదని అదే పనిగా ప్రచారం చేసిన కట్టుకథ, మాస్కో పొలిమేరల్లో జరిగిన పోరాటాల్లో తునాతునకలైంది.

యుద్ధరంగం అంతటా జర్మన్లు దాడిని కొనసాగించే స్థితిలో యిక లేరు. 1942 వేసవిలో జర్మనీ, దాని మిత్ర దేశాలూ తమ నిలవ బలాలనన్నిటినీ యుద్ధరంగపు దక్షిణ భాగంలో కేంద్రీకరించారు. ఆగ్నేయ దిశనుంచి మాస్కోను చేరుకోగలమనీ ఓల్గాను దాటి కకాసస్‌ను పట్టుకోగలమనీ ఆవిధంగా సోవియట్ దేశంలోని మధ్యజిల్లాలను ఉరల్స్‌నుండి, సైబీరియానుండి, కకాసస్‌లోని నూనె గనులనుండీ వేరుపర్చగలమనీ వారు ఆశించారు.

అపార నష్టాలతో శత్రువులు ఉక్రెయిన్ తూర్పు భాగాన్ని, డానెట్స్ బొగ్గుగనుల ప్రాంతాన్ని పట్టుకోగలిగారు, కకాసస్‌వేపు పురోగమించగలిగారు. సెప్టెంబరు మధ్యలో వారు స్టాలిన్‌గ్రాడ్‌లో చొరబడ్డారు. కఠిన యుద్ధానికిది నాంది. ప్రతియింటి కోసరమూ, ప్రతి అంతస్తుకోసరమూ తీవ్రపోరాటాలు సాగాయి. స్టాలిన్‌గ్రాడ్ రక్షకుల పరాక్రమానికి పావ్లోవ్ గృహం, మంచి స్మారక చిహ్నం. ఈ యింటిలో సార్జెంట్ పావ్లోవ్ కొద్దిమంది సైనికులతో తమకు పదిరెట్లు గల శత్రులను ఎదిర్చి నిలబడ్డారు. సోవియట్ ప్రజలందరూ స్టాలిన్‌గ్రాడ్ వీర రక్షకులను ప్రోత్సహించారు, వారికి అండగా వున్నారు. జర్మనీచే జయింపబడిన దేశాల ప్రజలందరూ స్టాలిన్‌గ్రాడ్ యుద్ధ విశేషాలను ఆతాదృక్కులతో గమనించారు. ఫాసిస్టు నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాటంలో సోవియట్ సైనికుల ధైర్య సాహసాలు వారికి ఉత్తేజకరంగా వుండేవి.

ఉరల్స్, సైబీరియాలలోని ఫాక్టరీలలో తయారైన ఆయుధాలు గల సోవియట్ సేనలోని కొత్త డివిజన్లు, జర్మన్ సేన పార్శ్వంలో కేంద్రీకరింప బడ్డాయి.

1942 నవంబరునెలలో ఒకనాటి ఉదయం సోవియట్ శతఘ్నుల చెవుల గింగురుపెట్టే గర్జనలు బయళ్ళను కంపింప జేశాయి. స్టాలిన్‌గ్రాడ్‌కు ఉత్తర దిశనూ, దక్షిణ దిశనూ టాంకుశ్రేణులు హిట్లరు సేనల స్థానాలను భగ్నంచేసి, త్వరత్వరగా ఒకదానికొకటి కలుసుకున్నాయి. శతఘ్ని విమానబలాల సహాయంతో కాల్బలం గండికొట్టబడిన ప్రదేశంలోనికి ప్రవహించింది. దాడి మొదలుపెట్టిన నాలుగోరోజున శత్రువులకు చుట్టూరా పెద్ద వలయం చుట్టివేసింది. ఫీల్డు-మార్షల్ పౌలస్ ఆధిపత్యానగల 330,000 మంది ఫాసిస్టు సేన చిత్తుగా ఓడిపోయింది, దాని సైనికులు హతులు కావడమో, బందీలు కావడమో జరిగింది. అదే సమయంలో సోవియట్ సేనలు ఉత్తర కకాసస్‌ను విముక్తి చేశాయి.

యుద్ధ ప్రారంభంలోనే ఫాసిస్టు దురాక్రమణదారులకు వెనుక తట్టున పెద్ద ఎత్తున గెరిల్లా ఉద్యమం సాగింది. ప్రతిచోటా గెరిల్లాల తుపాకీగుళ్ళు ఫాసిస్టులకు ప్రమాదం కలిగించాయి, కొన్ని గెరిల్లా దళాలు పెద్ద సేనలుగా ఏర్పడి, జర్మన్‌సేనల ఆక్రమణక్రింద నున్న జిల్లాలనే విముక్తం చేశాయి.

## మహోత్సవ దినం

1943 లో, జర్మన్ ఆఖరు దండయాత్ర ప్రయత్నానికి దెబ్బకొట్టాక, కుర్స్క్ పోరాటంలో శత్రువుల ఉత్తమ సేనలను సోవియట్ సేన పారద్రోలి కీలకమైన బూరవను శాశ్వతంగా వశపర్చుకుంది. జర్మన్ ఫాసిస్టు సేన నీపర్‌నదీ ప్రాంత పోరాటాలలోనూ, బైలో రష్యాలోనూ, బాల్టిక్ మండల విముక్తికోసం సాగిన పోరాటాలలోనూ ఓడింపబడింది. హిట్లరైట్ డాస్ స్వ్ రైక్ కోర్ ఆందోళనతో యిలా వ్రాసింది: "పెద్దపెద్ద మొత్తాలలో బోల్షివిక్కులనూ, సాంకేతిక విద్యనూ ఉరల్ మట్టినుంచి ఎవరో గొప్ప మంత్రవేత్త తయారు చేస్తున్నట్టుగా అపారమైన సోవియట్ బయళ్ళనుంచి కొత్తగా ప్రజా సమూహాలూ, సాంకేతిక ప్రజ్ఞలూ వస్తూవుండడం మనకు అబ్బురంగా కనిపిస్తోంది." ప్రజా వ్యూహ బలంనుంచి, తమ దేశ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకొరకు పోరాడిన సోవియట్ ప్రజల, సైనికుల, కార్మికుల, సమిష్టి రైతుల గొప్ప దేశభక్తినుంచి ఉద్భవించినది, యీ "అబ్బురం". 1944 లో సోవియట్ సేనలు సోవియట్ దేశ భూభాగ విముక్తిని పూర్తిచేసి, ఫాసిస్టు దాస్యాన్ని తొలగించుకొనడంలో చాలా యూరోపియన్ దేశాల ప్రజలకు తోడుపడ్డాయి. ఆ దేశాల ప్రజలు ప్రతిచోటా సోవియట్ సైనికులను తమ విముక్తి

(మిగత 31వ పుటలో)

# ఆగ్నేయాసియాకు అమెరికన్ సహాయంవల్ల కలుగుతున్న దుష్ఫలితాలు

## [థాయ్‌లెండ్, దక్షిణ-వియత్నామ్, ఫిలిప్పైన్స్]

ఎస్. పెర్బిక్‌స్కీ

బాంకాక్ పత్రికలు అమెరికా వ్యతిరేక వ్యాసాలను ప్రకటించని రోజు లేదంటూ యీ మధ్యనే న్యూయార్క్ టైమ్స్ పత్రిక బాంకాక్ విలేఖరి వార్త పంపాడు. థాయ్‌లెండుకు అమెరికన్ "సహాయం" ఇవ్వబడుతున్నప్పటికి గూడా ఆ దేశంలో యెందుకిలాంటి అమెరికన్ వ్యతిరేక భావాలు ప్రబలుతున్నాయని వాల్ స్ట్రీట్ జర్నల్ అను అమెరికన్ పత్రిక ప్రభుత్వాన్ని ప్రశ్నించింది.

ఆ ప్రశ్నకు సమాధానమేమిటో సుస్పష్టమే. అమెరికా థాయ్‌లెండ్ సర్వసత్తాధికారాన్ని విస్మరిస్తున్నదన్న విషయాన్ని ఎన్నో విషయాలు గట్టిగా రుజువు పరుస్తున్నాయి. ఉదాహరణకు, అమెరికాలోవున్న థాయ్‌లెండ్ రాయబారి నాయ్‌పోతి సరాసినీని అమెరికా విదేశాంగశాఖ సహాయ కార్యదర్శి రాబర్ట్‌సన్, థాయ్‌లెండ్ అంతరంగిక వ్యవహారాలలో జోక్యం కల్పించుకొనే అనేక విషయాలను గురించి ప్రశ్నలడిగాడు. థాయ్‌లెండ్ ప్రజలు "సియాటో"ను యెందుకు వ్యతిరేకిస్తున్నారనీ, "కమ్యూనిస్టు దేశాల" చలన చిత్రాలను, అందులో ముఖ్యంగా చైనా చలన చిత్రాలను థాయ్‌లెండ్‌లో ప్రదర్శించడానికి యెందుకు అనుమతిస్తున్నారనీ రాబర్ట్‌సన్ అడిగాడు. అంతటితో ఊరుకోలేదు. థాయ్‌లెండ్ కార్మికసంఘ సభ్యులు చైనా ప్రజారిపబ్లిక్ నుండి తిరిగి రాగానే అరెస్టు చేయబడుతారా, లేదా అని కూడా అడిగాడు.

థాయ్‌లెండ్ ఐక్య సామ్యవాద సంఘటన ప్రధాన కార్యదర్శి నరపతి, జులై మాసాంతంలో బాంకాక్‌లో జరిగిన ఒక బహిరంగ సభలో మాట్లాడుతూ, థాయ్‌లెండ్ "సియాటో"నుండి సాధ్యమైనంత త్వరలో వైదొలగాలని అన్నాడు. థాయ్‌లెండ్ యొక్క అనర్థాలన్నింటికీ మూలం అమెరికన్ జోక్యమేనని కూడా అతడన్నాడు. "మాకు జెట్ విమానాలు, టాంకులు అనవసరం. ఫ్యాక్టరీలు కావాలి."

అమెరికన్ ఆధిపత్యంపట్లా, స్వప్రయోజనం దృష్ట్యా అమెరికా చేస్తున్న "సహాయం" పట్లా అసంతృప్తి ఒక్క థాయ్‌లెండ్ లోనేగాక, అమెరికాతో వివిధ సైనిక, అసమస్థాయి ఆర్థిక ఒడంబడికలతో ముడిపడివున్న ఆగ్నేయ ఆసియా దేశాలలో గూడా ప్రబలుతున్నది.

దక్షిణ వియత్నామ్ పరిస్థితి హృదయ విదారకంగా ఉన్నది. దక్షిణ వియత్నామ్ ప్రభుత్వం యొక్క ఆర్థిక సంస్థలన్నీ దాదాపు పూర్తిగా అమెరికన్ సలహాదారుల చేతులలో ఉన్నాయి. వారికి అమెరికన్ "సహాయ"నిధిని పంపకం చేసే అధికారమేగాక, ఎగుమతి లైసెన్సులను జారీచేసే అధికారం ఉత్పత్తి చేయబడిన వ్యవసాయసరుకులను కొనే అధికారము గూడా ఉన్నది.

గత రెండు సంవత్సరాలకాలంలో దక్షిణ వియత్నామ్‌కు చేయబడిన అమెరికన్ "సహాయం"లో నూటికి 85 పాళ్ళు సైనిక ఖర్చులకొరకు వినియోగింపబడిందనీ, ఆర్థికావసరాలకు నూటికి 15 పాళ్ళు మాత్రమే ఖర్చు చేయబడిందనీ ఎస్ప్రిట్ అనే ఒక ఫ్రెంచి పత్రిక వెల్లడించింది. అంతేగాక ఈ నూటికి 15 పాళ్ళ మొత్తంలో గూడా మూడింట రెండువంతులు అమెరికానుండి దిగుమతి చేయబడిన వస్తువులపై ఖర్చుచేయబడింది. అవయినా ప్రజలకు ముఖ్యంగా అవసరమైన వస్తువులుగాని, జనాభాలో అత్యధిక భాగానికి అందుబాటులో ఉండేవిగాని కావు.

ఆర్థిక విధానాన్ని ఆరోగ్యవంతమైన స్థితికి తీసుకొని రావాలంటే అమెరికన్ "సహాయం" గాక, ఇతర మార్గాలు ఆలోచింపబడాలన్నది సుస్పష్టం. తాము అమెరికన్ల సహాయంతో యెలాంటి విజయాన్నీ సాధించలేమని వియత్నామ్ వాసులు తరుచు అంటుంటారని ఎస్ప్రిట్ వ్రాసింది.

ఫిలిప్పైన్స్ ప్రభుత్వంమీద అమెరికా కొన్ని అసమమైన సైనిక, రాజకీయ ఆర్థిక షరతులను పెట్టింది. ఫిలిప్పైన్ ప్రజల ఇష్టానికి వ్యతిరేకంగా అది "సియాటో" దురాక్రమణ కూటములోకి లాగబడింది. వివిధ నిర్బంధాలుగల ప్రాంతాల మాట అటుంచి, అమెరికాకు యీ భూభాగంలో 32 నావిక, వైమానిక యుద్ధ స్థావరాలువున్నాయి.

యుద్ధ స్థావరాలు నిర్మించడానికి 99 సంవత్సరాలకొరకు అద్దెకు తీసుకొనబడిన భూములు నిజానికి అమెరికా ఆస్తి అయిపోయాయని అమెరికన్ పత్రిక చికాగో సన్ ఎండ్ టైమ్స్ అంగీకరించింది. అమెరికన్ సైనికాధికారులు ఈ యుద్ధస్థావర ప్రాంతాలనుండి ఫిలిప్పైన్ ప్రజలను వెళ్ళగొట్టవచ్చును. అక్కడి జనాభానుండి పన్నులు వసూలు చేయడం, స్థానికాధికార సంస్థల అంతరంగిక వ్యవహారాలలో జోక్యం కల్పించుకోవడం, మొదలైన పనులన్నీ చేయవచ్చు.

ఫిలిప్పైన్ ప్రజల వత్తిడిమూలంగా 1956 లోనే అమెరికా యుద్ధస్థావరాల ఒడంబడికలను పునఃపరిశీలన చేసేందుకు సంప్రదింపులకు అంగీకరించవలసివచ్చింది. తమ దేశ జాతీయ స్వాతంత్ర్యానికి భిన్నంగా వున్న కొన్ని షరతులను పూర్తిగా తీసివేయాలని

(మిగత 28వ పుట చూడండి)





జ్డెజ్కాజ్‌గన్ రాగి గనులకు చెందిన 51వ పిట్, త్రవ్వకపు యంత్ర ముఖాంతర దృశ్యం

# ప్రజలే పాలకులు

వి. కుపిస్కో

[యాత్రానుభవాలు]

(ఈమధ్య కజకస్తాన్‌లో పర్యటించిన మా విలేఖరి వి. కుపిస్కో వ్రాసిన యాత్రాస్మృతుల చివరి వ్యాసమిది. ఇంతకు పూర్వపు వ్యాసాలు మా పత్రిక 18, 19 సంచికల్లో ప్రకటింపబడ్డాయి.)

సోవియట్ దేశంలోని ముడి ఇనుము గనులు అన్నింటిలోకి పెద్ద దయిన సొకొలోవ్-సార్బాయ్ గనియొక్క కథ అద్భుతంగా ఉంటుంది.



జ్డెజ్కాజ్‌గన్ నగర జలాగార తీరానవున్న జలక్రీడా కేంద్రదృశ్యం

స్టెప్పీలలోని సార్బాయ్ జలాశయం మీదుగా ఒకవిమానం రొగురుతూ వుండినది. కుస్తనాయ్‌కి దాదాపు 30 కిలోమీటర్ల దూర ములో ఉండగా దిక్సూచి యంత్రం యొక్క ముల్లు హఠాత్తుగా కు వైపుకు లాగివేసింది. ఏమిటి సంగతి? వైమానికుడు తన విమానాన్ని వెనుకకు తిప్పి మళ్ళా అదే స్థావరంమీదుగా వెళ్ళాడు. దిక్సూచి యంత్రం ముల్లు మళ్ళీ అదేవిధంగా తిరిగింది. అయ స్కాంతపు ఆకర్షణశక్తి? వైమానికుడు వెంటనే వెళ్ళి ఆ విష యాన్ని భూగర్భ శాస్త్రజ్ఞులకు తెలియ జేసాడు. భూగర్భశాస్త్రజ్ఞులు అక్కడికి వెళ్ళి పరిశీలించగా బ్రహ్మాండమయిన ముడిఇనుము నిక్షే పాలు బయటబడ్డాయి. చిత్తుగా తయారుచేసిన లెక్కల ప్రకారం ఉరల్స్‌లోని మాగ్నిటోగోర్స్క్ ఇనుము యంత్రాగారంలాంటి బ్రహ్మాండమైన ఉనుము యంత్రాగారాలను ఎనిమిదింటిని నిర్మించ వచ్చునని అంచనా వేయబడింది. ఈ నిక్షేపాన్ని కనుగొన్నందుకు ఆ వైమానికుడు మిఖెయిల్ సుర్గుతనోవ్‌కు లెనిన్ బహుమతి ఇవ్వ బడింది.

"పది సంవత్సరాల క్రితం కుస్తనాయ్ స్టెప్పీలలో ముడి ఇనుముకొరకు వెతకడమంటే అర్థరహితమైన విషయంగా భావింప బడుతూ వుండేది," అంటూ సోకొలోవ్-సార్బాయ్ ముడిఇనుము

కరగండా బొగ్గును సరఫరా చేస్తుంది



ప్రదేశంలో మొదటినుంచి పనిచేస్తున్న భూగర్భశాస్త్రజ్ఞుడు ఇవాన్ కోచెర్గిన్ అన్నాడు. "ఇప్పుడా విషయం తలుచుకొంటే వింతగా ఉం టుంది. ఈ గనులనుండి గత పదిసంవత్సరాలలోను. ముడిఇనుముకు ప్రపంచమంతటా ప్రఖ్యాతిగాంచిన ఉరల్స్ ప్రాంతం నుండి గడచిన 250 సంవత్సరాల నుంచి త్రవ్వబడిన ముడిఇనుముకంటే ఎక్కువ త్రవ్వబడింది. ఈ మండలంలోని ముడిఇనుము నిక్షేపాలు ఎంత పెద్దవో చెప్పడం కష్టం. ఇప్పటివరకు 15 వేల మిలియన్ టన్నుల ముడిఇనుమును కనుగొన్నాము. అమెరికాలోని ముడిఇనుము నిధుల మొత్తం 7.6 వేల మిలియన్ టన్నులని, అనగా కుస్తనాయ్‌లో మేము కనుగొన్నదానిలో సగమని తెలుసుకొన్నట్లయితే ఇదెంత గొప్ప నిధో అర్థం కాగలదు. ప్రతియేడాది కొత్తనిధులను కను గొంటున్నాము. భూగర్భ పదార్థ విజ్ఞానశాస్త్రజ్ఞులు కనుగొన్న అయ స్కాంత ఆకర్షణశక్తిగల స్థలాలను ఇంకా ఎన్నింటినో పరిశీలించి త్రవ్వవలసి యున్నది.

"మరి బొగ్గు సంగతో? బొగ్గు గూడా చాలా ఉన్నదా?" అని నేనడిగాను.

"ఇప్పటివరకు మేము 50 వేల మిలియన్ టన్నుల బొగ్గును కనుగొన్నాము. అనగా, కరగండా మండలంలో ఉన్నదానికంటే అనేకరెట్లు ఉన్నదన్నమాట. కాని మేము కనుగొన్నది బొగ్గు మాత్రమే కాదు. బాక్సైట్ గనులు అనేకంవున్నాయి. దీనిని వినియో గించుకోడానికి పావ్లొదార్ దగ్గర ఒక అల్యూమినియం యంత్రాగారం నిర్మింప బడుతున్నది. అంతేగాక యీ ప్రాంతంలో టిటానియం, జిర్కోనియం, కోబాల్ట్, నికెల్, తదితర లోహాలనిధులు అపారంగా వున్నాయి. ప్రపంచంలోకల్లా పెద్దదైన అస్బెస్టాస్ నిధి, తదితర విలువైన ఖనిజాలు కూడా వున్నాయి.

నిర్మాణపు పనులకొరకు ప్రతిరోజు కొత్త యంత్రాలు తీసు కొని రాబడుతున్నాయి. ఉరల్స్‌నుంచి పద్నాలుగు క్యూబుల ఎల క్ట్రిక్ ఎక్సవేటర్లు దోన్బాస్‌నుండి శక్తివంతమైన పంపులు, పైపులు, లెనిన్‌గ్రాడ్ నుండి ఎలక్ట్రిక్ మోటార్లు వచ్చాయి. కుస్తనాయ్ స్టెప్పీ లలో ముడి ఇనుము గనికి సంబంధించిన పనులలో వందకుపైగా పారిశ్రామిక సంస్థలు పాలొంటున్నాయి. దీని ఫలితం త్వరలోనే లభించబోతున్నది: అక్టోబరు విప్లవం నలభైయవ వార్షికోత్సవం నాటికల్లా ఉత్తమమూ, అతి చవక అయిన 100,000 టన్నుల ముడి ఇనుము బయటికి తీయబడుతుంది.

అక్కడ నిర్మింపబడుతున్నది ఒక్క గనులేకాదు. బ్రహ్మాండ మైన కాన్సన్ట్రేటింగ్ ప్లాంటులుగూడా నిర్మింప బడుతున్నాయి. ఇవి సంవత్సరానికి పది మిలియన్ టన్నుల ముడి ఇనుమును శుద్ధి చేస్తాయి.

## స్టెప్పీలపై విజయం

మేము కారులో గోధుమ పొలాలను చూచుకొంటూ వెళ్లాము. వాటికి అంతే కనబడలేదు. బీడు భూముల్లోని గోధుమపొలాల సము ద్రాన్ని గురించి నేను ఇదివరకే చాలా చదివాను. కాని దానిని చూచే టప్పటికి నిజంగా నా హృదయం గంతులువేసింది. మానవుని మహా శక్తి కార్యరూపం దాల్చిందిక్కడ. రొట్టె-జీవం అన్నమాట!

సోవియట్ దేశంలోని వివిధజాతులు బీడుభూముల సాగుకు తమకు సాధ్యమైనంతగా దోహదం చేశాయి. ఇవాన్ రుద్‌నొయ్ అనే ఒక ట్రాక్టర్ దళ నాయకుడు ఉక్రెయిన్ నుంచి వచ్చాడు. త్వర

లోనే అతడు కజకస్తాన్ ప్రజలకు అభిమాన పాత్రుడయ్యాడు. వారి రిపబ్లిక్ యొక్క సుప్రీమ్ సోవియట్‌కు ప్రతినిధిగా యెన్నుకొన్నారు. రుద్‌స్కాయికి ఇప్పుడు సామ్యవాద శ్రమవీర బిరుదు కూడా యివ్వబడింది. గ్రన్సార్కిస్యన్ అనే మరొక సామ్యవాద శ్రమవీరుడు కజకస్తాన్‌కు ఆర్మీనియా నుంచి వచ్చాడు. ఇతడొక్కడే అనేక గ్రామాలు కలిసి సేద్యంచేసే భూమికంటే యెక్కువ బీడు భూమిని దున్నాడు. ఇక్కడికి కొత్తగా వచ్చి నివాసం యేర్పరచుకొన్న ఆరు లక్షల మందిలో ప్రతి ఒక్కరు ఈ బీడు భూముల సేద్యానికి శక్తి వంచనలేకుండా దోహదం చేశారు. దేశం వారికృషిని గుర్తించింది. దేశంలోకల్లా అత్యున్నత బిరుదు అయిన ఆర్డర్ ఆఫ్ లెనిన్ బిరుదు ఇవ్వబడింది.

కజకస్తాన్‌లో రెండు వేసంగుల లోపల యాభై మిలియన్ ఎకరాల బీడు భూమి దున్నబడింది. యాభై మిలియన్ ఎకరాల భూమంటే 200,000 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణమన్న మాట. మనకు తెలిసిన విషయాలతో దీనిని పోల్చి చూచినట్లయితే ఇంకా బాగా అర్థమవుతుంది. గ్రేట్ బ్రిటన్ యొక్క పూర్తి విస్తీర్ణం—244 000 చదరపు కిలో మీటర్ల విస్తీర్ణం—కజకస్తాన్‌లో సేద్యంలోకి తీసుకొని రాబడిన బీడు భూమి విస్తీర్ణంకంటె యిది కొద్దిగా ఎక్కువవున్నది.

అక్కడ నా కెవరో ఒక గుప్పెడు ధాన్యాన్ని బహూకరించారు. దానినే ఇక్కడ మిత్రధాన్యం అంటారు. భారత దేశపు పార్లమెంటరీ ప్రతినిధి వర్గంలోని కృష్ణమూర్తిరావు. అతని సహచరులు ట్రాక్టర్లతో దున్ని విత్తుచల్లిన బాళ్ళలో పండినధాన్యమది. వారు చల్లిన పొలం బాగాపండింది.



సొకొలొవ్, సర్బాయ్ లోహపు గనులనుండి ప్రపథమంగా లోహాన్ని తీసిన వాలెన్తిన్ పైతునిన్ (ఎడమ) ఇవాన్ కొచెరిన్లు, లెనిన్ బహుమతి విజేతలు

## ఉపసంహారం

ఈ కొద్దిపాటి వ్యాసాల్లో, కజకస్తాన్‌లోని అన్ని ముఖ్యమైన విషయాలను గురించి తెలియజేయడం సాధ్యంకాలేదని నేను చెప్పవలసియున్నది. ఎంబా, గుర్యేవ్‌లలోని నూనెగనుల కార్మికులను గురించి, దజకజ్గన్, బాల్ఖాష్‌లలోని మురిఇనుము గనుల కార్మికులను గురించి మీరీ వ్యాసాల్లో యేమీ చదవలేరు. అంతేగాదు; దేశంలోకల్లా పెద్దదైన హార్వెస్ట్ కంబైన్ల నిర్మాణ యంత్రాగారం నిర్మింపబడుతున్న పావ్లొదార్ నగరాన్ని గురించిగానీ, రోలింగ్ మిల్లుల కవసరమైన పరికలాలను ఉత్పత్తిచేసే యంత్రం నిర్మింపబడుతున్న పెత్రొ పావ్‌లొవ్స్క నగరాన్ని గురించిగాని మీరేమీ తెలుసు కోలేరు. కజక్‌స్తాన్‌లో తొమ్మిది ఆర్థిక ప్రాంతాలున్నాయి. అందులో నేను ఐదింటినే సందర్శించాను. అయినప్పటికి నేను చూచిన కొద్ది విషయం కూడా, నలభై సంవత్సరాలలో కజకస్తాన్ పొందిన అభివృద్ధిని, సంచారజాతుల స్థాయినుంచి సోషలిజంకు పురోగమించిన విషయాన్ని సువ్యక్తం చేస్తున్నది.

---

## ఆగ్నేయాసియాకు అమెరికన్ సహాయంవల్ల కలుగుతున్న దుష్ఫలితాలు

(25వ పుట తరువాయి)

ఫిలిప్పైన్ ప్రజలు పట్టుబడుతున్నారు. కాని అమెరికన్ పాలకవర్గాలు తమ ప్రత్యేక సౌకర్యాలను వదులుకోదలుచుకో లేదు. అమెరికన్ యుద్ధ స్థావరాలపైన ఫిలిప్పైన్ ప్రభుత్వ పతాకాన్ని యెగురవేయడానికి, అమెరికన్ సైనికులను "సియాటో" దురాక్రమణ కూటమి అధికార పరిధిలో వుంచడానికీ మాత్రమే అంగీకరించాయి.

అమెరికన్ గుత్త వ్యాపారుల ఆధిపత్యంలోవున్న ఫిలిప్పైన్స్ ఆర్థిక విధానం అతి దుస్థితిలో పడ్డది. అమెరికన్ వస్తువులు ఫిలిప్పైన్స్‌కు యేలాంటి నిర్బంధాలు లేకుండా దిగుమతి చేయబడుతుండగా, ఫిలిప్పైన్స్ వస్తువులు అమెరికాకు ప్రత్యేక కోటాలమీద మాత్రమే దిగుమతి అవుతున్నాయి.

ఆగ్నేయ ఆసియా దేశాలలోని ప్రజానీకంలోని అత్యధిక భాగం తమపై అమెరికా రుద్దుతున్న రాజకీయ, ఆర్థిక, సైనిక బానిసత్వపు ఒడంబడికలను నానాటికీ యెక్కువగా వ్యతిరేకిస్తున్నారు. ఎంత ఆధునికమైన వైనప్పటికి, ఆయుధాలతోగాని, డాలర్ల సహాయంతోగాని దేశాలను లోబరచుకొనడం సాధ్యంకాదన్న విషయాన్ని అమెరికన్ విదేశాంగ శాఖ గుర్తించాలని ఇండోనీసియా పత్రిక దుతా మస్‌హాకరత్ వ్రాసింది. ఈ విషయంతో యేకీభవించక తప్పదు.

# మానవుడి పాట్లు

కథకుడు:- మిఖయిల్ షోలఖోవ్ అనువాదకుడు :- శ్రీ.శ్రీ.

(గతసంచిక తరువాయి)

స్తరేనయ్యా; అలా కొన్నాళ్లు జరిగాక, పిల్లలు కూడా పుట్టారు... మొదట కొడుకు, తర్వాత ఇద్దరూ అమ్మాయిలూ. అప్పుడే నేను తాగటం మానేయాల్సి వచ్చింది. వచ్చిన జీతం అంతా నా భార్యచేతికే ఇచ్చేవాణ్ని. కలకలలాడుతోన్న ఇంటిపనుల్లో మునిగిపోయి. అసలు తాగుటకు పడేదికాదు.... ఎప్పుడైనా. ఒక్కొక్కప్పుడు. సెలవరోజున మాత్రం, ఒక గ్లాసుడు 'బీర్' తాగి దానితోనే సరిపెట్టేసేవాణ్ని....

1929వ సంవత్సరం వచ్చింది. నాకు కార్లలో ఆసక్తి కలిగింది. ఎలాగో డ్రైవింగ్ నేర్చుకుని, ఒక లారీమీద పనిచేయటం మొదలెట్టా. ఫాక్టరీ పనికంటే, నాకీపనే బాగా నచ్చింది. అందుకే, డ్రైవింగ్ చేస్తూనే, నాకు తెలీకుండానే, పది సంవత్సరాలు గడిపేశాను. అదంతా ఒక కల. పది సంవత్సరాలొక లెక్కేంటి ? నలభై దాటిన ఎవడైనా అడుగు. అతని జీవితమంతా ఎలాగడిపాడని. అప్పుడర్థమౌతుంది అతనేదీ గుర్తించలేదని.... అసలు గతం అంతా అంతేలే.

ఆ పది సంవత్సరాలు, రాత్రింబవళ్ళు పనిచేశా. నేను బాగా డబ్బు సంపాదించిన మూలంగా, ఇతర్లకేమి తీసిపోకుండా, హాయిగానే బ్రతికాం. దానికితోడు, మా పిల్లలు, మరింత ఆనందం చేకూర్చారు. ముగ్గురూ బాగా చదివేవారు. అందులోనూ. పెద్దవాడు ఆంటోలీ, మరీ తెలివైనవాడు. వాడు లెక్కల్లో దిట్ట.... అందుకే, ఓసారి, మాస్కోలోని పేపర్లో కూడా వచ్చింది వాడిపేరు. వాడికా తెలివితేటలెలా వచ్చాయని అడిగితేమాత్రం చెప్పలేను. కాని...., వాడు తెచ్చుకున్న మంచిపేరుచూసి, చాలా ఆనందించేవాణ్ని. నిజం చెప్పాలంటే సోదరా.... నా కొడుకింతవాడయ్యాడని, చాలా గర్వించేవాణ్ననుకోవమ్మా....

ఈ పది సంవత్సరాలనుంచీ కూడబెట్టిన డబ్బుతో. యుద్ధం రాకముందే, ఒక చిన్న గుడిసెను కట్టుకున్నాం.... ఆ గుడిసెలోని. రెండు గదులూ, ఒక వసారా, ఒక షెడ్డూ. నిజంగా మాకు ఎక్కువే. దానికితోడు, ఇరీనా. ఎలాగో రెండు మేకల్ని తీసుకొచ్చింది. అంతకన్నా ఇంకేం కావాలి ? మాపిల్లలికి పాలు, ఉండటానికి చక్కని ఇల్లు. కట్టుకోటానికి మంచి బట్టలు. తినటానికి తిండి. కాళ్ళకు జోళ్ళు అన్నీ కుదిరాయ్.... అన్నీ బాగానే కుదిరినా, ఇల్లు కట్టుకున్న చోటుమటుకు సరియైనదికాదయ్యా.... అది విమానాశ్రయానికి బాగా దగ్గరలో వుంది.... అక్కడ కాకుండా, మరేచోటనైనా, కుటీరం కట్టివున్నట్టయితే, నా జీవితమే మరో విధంగా వుండేది తమ్ముడూ....

సరిగ్గా అప్పుడొచ్చింది..........యుద్ధం. ఆ మరునటిరోజే. సైన్యంలో చేరమని పిలుపొచ్చింది.... నా భార్యా. పిల్లలూ అంతా వచ్చారు స్టేషన్కి నన్ను పంపించటానికి.... ఆడపిల్లలిద్దరూ ఏమీ ఏడ్వకపోయినా ఆంటోలీ మాత్రం చలివేసినవాడిలా వణికిపోయాడు. అయినా ఎలాగో తమాయించుకున్నాడు.... కాని.... ఆమె.... నా ప్రాణం కంటె ఎక్కువైన, నా 'ఇరినా' మాత్రం ఆ బాధను భరించలేకపోయింది. మా పదిహేనేళ్ళ దాంపత్యంలోనూ, అంత దుర్దినం ఎప్పుడూ రాలేదు. ఆ రాత్రి ఆమె కన్నీళ్ళతో. నా చొక్కా పూర్తిగా తడిసిపోయింది. ఉదయం అయింది. కాని ఆమెలో మార్పేమీ లేదు.... అంతా స్టేషన్‌కి వెళ్ళాం.... స్టేషన్లో ఆమె ముఖాన్ని చూడలేకపోయా ...రాత్రంతా ఏడ్చినట్టుంది.... కళ్ళంతా వాచిపోయాయ్.... ఒగురుస్తూ ఎండిపోయిన పెదవుల్ని. లోతుకుపోయిన కళ్ళనీ చూస్తుంటే. పిచ్చెక్కినవాళ్ళ ముఖంలావుంది..........జేబురుమాలుతో ముఖాన్ని కప్పుకుంటూ, తన బాధను దాచాలని వృధాగా ప్రయత్నిస్తోందామె. ఆఫీసర్లు. నన్ను లోపలికి రమ్మని చెప్పగానే. ఆమాంతంగా, నా మెడకు మెలేసుకుని ఏడవటం మొదలెట్టింది..........కూలిపోయే మహావృక్షంలాగ, ఆమె నిలువెల్లా కంపించిపోతోంది. పిల్లలు ఆమెను మాటల్లో పెట్టాలని ప్రయత్నించారు. అదేం కుదరలేదు.... ఇతర్లంతా, తమ భర్తలతో ఏదేదో మాటలాడుకుంటున్నారు. కాని నా భార్య మటుకు బాధతో బ్రద్దలైపోతోంది.... ఇంక లాభం లేదని. ఆమెను దగ్గరకంటూ లాక్కుని "అదేంటి ఇరీనా ధైర్యంగా వుండాలి.... ఏడిస్తే ఎలా... నేవెళ్ళేటప్పుడైనా మాటలాడుమరీ.... ఏడవకు...."అన్నా ఆమెకు ధైర్యం చెప్పాలనే వుద్దేశ్యంతో.... కాని అమె ఏడుస్తూనే ఏమందో తెల్సా సోదరా...."మనం బ్రతికుండగా మళ్ళీ కల్సుకోలేం ఆండ్రీ.... కల్సుకోలేం...."అంది..........ఆ పరిస్థితి చూసి. నా హృదయం పగులుతున్న సమయంలో ఆడవలసిన మాటలేనా అవి.... ఆమెను విడిచిపెట్టడం. నాకూ ఎంత బాధాకరమో ఆమె ఊహించలేకపోయింది. ఎందుకనిపించిందో మరి.... ఆమె చేతులు విడదీసి ఒకతోపుతోశా.... నేను మామూలుగానే అనుకున్నా. ఆ తోపుకు ఆమె మూడడుగులదూరం వెళ్ళింది. ఆమె మళ్ళీ చిన్ని చిన్ని అడుగులు వేసుకుంటూ నాదగ్గరకొచ్చింది.... నేనేదో పిచ్చికోపంతో అరుస్తున్నా...."అదేనా నన్ను పంపించే విధానం ? ఏం. నేను బ్రతికుండగానే కాల్చేద్దామనా ?"అని ఇంకా ఏదేదో అనబోయా కాని.... ఆమె ముఖంలోని అమాయకత్వం. ఆ కళ్ళల్లోని బాధ చూస్తుంటే మరి ఆ కోపం ఏమైందో తెలియదు కాని.... ఆమెను అమాంతంగా కౌగలించుకున్నా...."అంటూ అతను హఠాత్తుగా ఆపేశాడు.... అతను రెండు క్షణాలవరకూ ఏమీ మాటలాడలేకపోయాడు అంతబాధ ననుభవిస్తూన్నా. అతని కళ్ళల్లో నీళ్ళు లేవు.... ఈ విధంగా, ఎన్నో. కొన్ని లక్షలసార్లు. ఏడవటంతో, ఆ కళ్ళల్లోని నీరంతా ఎండిపోయిందేమో ! అతను చాలా ఆవేశంగా వున్నాడు — అతని పెదవులు వణుకుతున్నాయ్.... గద్దం అదురుతోంది.... అతన్ని చూస్తే నాకు చాలా జాలేసి "ఎందుకలా అయిపోతావ్.... ధైర్యంగా వుండు" అన్నా అతను నామాట వినిపించుకున్నట్లు కనపడలేదు.... బరువుగా నిట్టూరుస్తూ అన్నాడతను...."ఆ సంఘటన .... ఆమెనా విధంగా తోసేసిన సంఘటనే. బ్రతికినంత కాలం, నన్ను కలచివేస్తుంది.... నేను చేసిన ఆ ఘోరానికి, నామనసు

నన్నెప్పుడూ క్షమించదు సోదరా, క్షమించదు" అని మరి మాటలాడలేకపోయాను. అతని పగిలిన గొంతులోని బాధను చెప్పడం ఎవ్వరి తరంగాదు....అలా మాటలాడకుండా అతను చాలాసేపే వుండిపోయాను. ఆ పొగాకుతో మరో సిగరెట్ చుట్టుతామనుకున్నాడు కాని, పాపం, అతని చేతిలోని కాగితం చిరిగిపోయి, పొగాకంతా పడిపోయింది. ఎలాగో తిప్పలుపడి, అపకతపకగా, ఒక సిగరెట్టు చుట్టి, రెండు దమ్ములు లాగాను. ఆ ఘాటు నసాళం అంటినట్టుంది. గొంతు సవరించుకుని, తిరిగి మొదలెట్టేడు తన కథని....

"ఎలాగో ఇరీనా చేతుల్లోంచి తప్పించుకుని, ఆమె ముఖాన్ని రెండు చేతుల్లో తీసుకుని, ఆమె పెదవులను ముద్దెట్టుకున్నా. అబ్బ మంచుకన్న చల్లగా, సుద్దకన్నా తెల్లగావున్నాయవి. ఆమెనాస్థితిలో మరొకక్షణంకూడా చూడలేక, పిల్లలకు 'గుడ్‌బై' చెప్పి, రైలులోకి ఇష్టం లేకపోయినా, దూకాను. రైలు నెమ్మదిగా కదిలింది నా వాళ్ళను నానుండి దూరంచేస్తూ....పిల్లలు ముగ్గురూ, ఎలాగో నవ్వు తెచ్చిపెట్టుకుని, చేతులూపుతున్నారు. ఆమెమాత్రం గుండె బరువు ఎక్కువై ఆగిపోతుందేమోనని కాబోలు రెండు చేతులు గుండె కదుముకుని, ముందుకువంగిపోయి, అదోలా చూస్తూ బొమ్మలా వుండిపోయింది. ఆమె తీరుచూస్తే ఏదో పెద్ద తుఫానులో ఎదురు గాలి తాకిడికి తట్టుకోలేక, ముందుకువంగి నడుస్తున్నదానిలా వుంది. ఆ ఎండిపోయిన పెదవులు, తెల్లగా పాలిపోయిన చెక్కిళ్ళు, జీవం లేని కళ్ళు మరోనిముషం కూడా చూడలేక, బుర్ర గిర్రున తిప్పేసుకున్నా....బాధ భరించలేక కళ్ళు మూసుకున్నా....అయినా, ఆమె అదే రూపంలో ప్రత్యక్షమైంది అప్పట్నుంచి ఎప్పుడూ, ఆమె, అదే రూపంలో కనిపిస్తోంది. ఆఖరికి కలల్లో కూడా. ఆ విధంగా తోసేసి, ఆమెకంత బాధకలిగించినందుకు నన్ను నేనే తిట్టుకున్నా. అయినా శాంతిలేదు. ఆనాటి ఆమె రూపం గుర్తుకొచ్చినప్పుడల్లా, బండకత్తితో, నన్నెవరో ముక్కలుగా నరుకుతున్నట్టనిపిస్తుంది....

సరే....తర్వాత, 'ఉక్రేన్' లోని 'బెలయా సెఃకోవ్' దగ్గరున్న మా యూనిట్లను చేరుకున్నాం....నాకు జిస్-5 ఇచ్చారు. అంటే నేను యుద్ధ భూమిలోనే వున్నానన్నమాట. యుద్ధం గురించి విపులంగా చెప్పడం ఎందుకూ? నువ్వు స్వయంగా చూడనే చూశావ్‌గా?....సైన్యంలో వున్నప్పుడు, ముఖ్యంగా యుద్ధంలో వున్నప్పుడు, ఇంటిదగ్గర్నుంచి లెక్కలేనన్ని ఉత్తరాలొస్తాయ్....కాని అన్నిటికీ జవాబు లివ్వలేవు....ఒక వేళ ఇచ్చినా ఏంరాస్తావ్? అంతా బాగానే వుందనీ, మాదళం ముందుకు పోతోందనీ, త్వరగానే వచ్చేస్తాననా రాస్తావ్....అంతేనా....? అసలు అంతకన్నా ఏముందిలే రాయటానికి? యుద్ధంలోని ఘోరాలు, వాళ్ళకు రాయగలవేంటి....? అబ్బే ...నేనైతే, అటువంటివి ఒక్క ముక్కగూడా రాయలేకపోయేవాణ్ని సుమా. అయినా అలాంటివి రాయటంవల్ల ఏంలాభం చెప్పు. యుద్ధంలో ఎలా వున్నావో అని భయపడి చచ్చేవాళ్ళకి, యుద్ధంలోని ఘోరాలు, నువ్వు వర్ణించి రాశావంటే, అది చదివి, వాళ్ళు బేబేలెత్తి హడిలి ఛస్తారు....అన్నంలో, ఒక్క మెతుకుకూడా కొరకలేరు....ఒక్క క్షణంకూడా కన్ను మూయలేరు....పాపం వాళ్ళనావిధంగా బాధపెట్టడం ఎందుకు చెప్పు....యుద్ధంలో నిలవలేని పిరికిపందవైతే, అసలు అక్కడికెందుకురావాలి?....వచ్చావు కనుక, వీరసైనికుడవై మాతృదేశం కోసం, ఏ క్షణానైనానసరే ప్రాణాన్ని అర్పించటానికి తయారుగా వుండాలి. అంత దమ్ములేకపోతే, బైటకుపోయి, ఏ ఆవుపాలో పితుక్కుంటూ, ఆడదానిలా బతకాలి....ఔనా ...?....ఏమంటావ్....?....సరేలే....ఈ సోదంతా ఎందుకు? వింటోంటే, నాకు తలకాయనొప్పి వస్తోందేమోకూడా....అసలు సంగతికొద్దాం" అంటూ సిగరెట్టు దమ్ము బాగాలాగి, గాలిలోకి పొగవదుల్తూ తిరిగి మొదలెట్టాడు...."తీరా చూస్తే, పూర్తిగా ఒక సంవత్సరంగూడా నేను యుద్ధంలో పని చేయలేదు. ఆ లోపునే, నాకు రెండుసార్లు గాయాలు తగిలాయ్....పెద్ద బలమైనవి కాదులే....ఒకసారి భుజం మీద, రెండోసారి కాలిమీద. మొట్టమొదటిసారి 'బులెట్' వల్లా, రెండోసారి. 'ష్రాప్‌నెల్' వల్లా తగిలాయా గాయాలు. మొదటిసారి బలే అదృష్టంలే ...అసలు నేను చచ్చేవాణ్నే తెల్సా....జర్మన్లు, నా లారీమీద, గుండ్లవర్షం కురిపించారు. కాని ఎలాగో, చిన్నగాయంతో బతికి బయటపడ్డా ...రెండోసారి మటుకేనయ్యా ఘోరం....ఆ దెబ్బతోనే పోతే ఫర్వాలేకపొయ్యేది....కాని....వాళ్ళ తస్సాదియ్యా....., వాళ్ళకు దొరికిపొయ్యేనయ్య ఖైదీగా....వాళ్లు నన్ను 'లొజావెస్కీ'లో పట్టుకున్నారు. ఎప్పుడు....1942 'మే' లో....అసలది ఎలా జరిగిందో తెల్సా? ఒకసారి బలే ఘోరమైన పరిస్థితి ఏర్పడిందిలే.... మా దగ్గరున్న 120 యం యం 'హెవిట్జర్' బేటరీలలో ఒకటి, దూరంగా, శత్రువులతో పోరాడుతోంది. అనుకోని విధంగా వాళ్ళ దగ్గరున్న మందుగుండు అంతా అయిపోవచ్చింది....శత్రువులు, జోరుగా ముందుకు వచ్చేస్తున్నారు....మావాళ్ళ దగ్గర మందు అయిపోతున్నకొద్దీ, వాళ్ళ టాంకులు మరీ ముందుకొచ్చేస్తున్నాయ్.... వాటినికాని ఆపలేకపోతే, మా దళం అంతా నాశనమే....అందుకని ముందు మావాళ్ళకి మందుగుండు చేరాలి....అది ఓపట్టానసాధ్యంలా కనపళ్ళేదు....ఎందుకంటే...., వాళ్లు, ఎడం ప్రక్కనుండి టాంకులతోనూ, ఎదరనుంచీ, కుడినుంచీ, కాల్బలంతోనూ మూడు ప్రక్కల్నుంచి చుట్టుముడుతోంటే, మావాళ్ళకు సరుకును చేర్చడం, అంత తేలికైన పనేంగాదు....అయినా...., నా లారీనిండా మందుగుండు నింపి, తీసుకెళ్ళే ప్రయత్నంలో వున్నా....అప్పుడు మాదళం కమాండర్ వచ్చి నన్నేమని అడిగాడో తెల్సా? "సొకొలోవ్, ఈ సరుకు తీసుకునివెళ్ళి వాళ్ళకందించగలవా?" అని అతని ప్రశ్నతో నా ఆత్మాభిమానం దెబ్బతింది....వెంటనే "తీసుకెళ్ళగలనా ఏంటి? తీసుకెళ్ళితీరాలి....అది నా విధ్యుక్తధర్మం....నా ధర్మం నెరవేర్చటంలో, నేను నా ప్రాణానికి వెరువను కమాండర్" అన్నాను ధైర్యంగా.... 'సరే అయితేకానీ' అన్నాడతను నవ్వుతూ....హుషారుగా, 'స్టీరింగ్' ముందుకురికి, మీటతొక్కాను....అంత స్పీడుగా నేనెప్పుడూ 'డ్రైవ్' చేయలేదు. మందుగుండుతో అంత జోరుగా పోవటం ప్రమాదం అని తెల్సు. అయినా ఏం చేయను?....మా కుర్రాళ్ళంతా, అక్కడ వట్టి చేతుల్తో యుద్ధం చేస్తూంటే, నేను పెళ్ళి కొడుకులా నెమ్మదిగా ఎలా వెళ్ళగలను?....మా వాళ్ళని ఎప్పుడు చేరతానా అన్న ఆత్రుతతో, లారీ ఎంత వడిగా పోతోందో నేను గుర్తించనేలేదు. నేను ఇంచుమించుగా చాలా దూరమే వచ్చేశాను. మహావుంటే, మా బాటరీ ఒక 'కిలోమీటరు' దూరంలో వుండొచ్చు. నేను రోడ్డు మలుపు తిరిగానంటే చాలు, అక్కడే మా బాటరీ వుంది. కాని ఇంతలో ఓ వింత జరిగింది....అక్కడ మా 'ఇన్‌ఫాంట్రీ' ఒకటి 'వాళ్ళ' మీద గుండ్లు కురిపిస్తోంది... దాన్నలావదిలివేసి, నేనెలా వెళ్ళను....సరే, దానిక్కావలసిన మందు ఇచ్చా మళ్ళీ నాలారీ దౌడుతీసింది, తారాజువ్వలా దూసుకపోతోంది. రోడ్డు మలుపు తిరిగాను. మా వాళ్ళను చేరబోతున్నా....రోడ్డుమీద ఉంచబడ్డ ఏదో ఫిరంగి మాలారీని ఢీకొంది, అంతే...., అప్పుడెంతశబ్దం వచ్చిందోకూడా నేవినలేదు. నా బుర్రలో ఏదో అగ్నిగోళం బద్దలైనట్లయింది....అంతే....ఆ తర్వాత ఏం జరిగిందో నాకు గుర్తులేదు. మళ్ళీ తిరిగి నేను ఎలా బతికానో నాకు

తెలీదు. అలా, అక్కడ ఎంతసేపు పడున్నానో అంతకన్నా తెలీదు. ఎప్పుడో కళ్లు తెరిచాను....కాని లేవలేకపోయా. నా తలంతా కుదుపుతోంది, జ్వరంవచ్చిన వాడిలా...., నా శరీరం అంతా వణుకుతోంది. కళ్లు చీకట్లుకమ్మి, అసలు నాకేమీ కనిపించటం లేదు. నా ఎడం భుజంలో, ఏదో దూరి గొలుకుతూన్నట్టయి, విపరీతమైన బాధ పెడుతోంది. దానికితోడు వళ్ళంతా, చెప్పలేనంత నొప్పులు, ఎవరో, రెండురోజుల్నుంచీ, అదేపనిగా తొక్కుతూ, విడవకుండా కర్రలతో మోదినట్టుగా వుంది. పొట్టలోని నొప్పి భరించలేక, పొట్టపిసుకుతూ, ఎంతసేపో అలాగే ఉండిపోయా....ఎంతసేపు అలా వుండిపోయానో నాకే తెలీదు. చివరికి, ఎప్పుడో కొంచం సత్తువ కలిగినట్టయింది. అతికష్టంమీద లేచాను ...అయినా నాకేంతెలీలేదు. నేనెక్కడున్నానో, అసలు నాకేం జరిగిందో కూడా గుర్తులేకుండా పోయింది. మరి మంచోలేక, చతికిలబడుతూ, పక్కనున్నవాటిని ఒక్కొక్కటి నేచూస్తూ, అసలేం జరిగిందో గుర్తు చేసుకుందికి ప్రయత్నం చేస్తున్నా.

కొంతసేపు ఏమీ తెలీలేదు. తర్వాత నా చుట్టూ వున్నవాటిని క్రమంగా గుర్తుపట్టగలిగా....నేను తీసుకొచ్చిన, గుండ్లన్నీ, రోడ్డుమీద చిందర వందరగా పడివున్నాయ్. నేను వచ్చినలారీ ముక్కముక్కలై పోయింది....దాని చక్రాలు తలోమూలా పడ్డాయ్.

అప్పుడు నాకాళ్ళ పరిస్థితి చెబితే, నువ్వు సిగ్గేయటం లేదా అని అడగొచ్చు. కాని సోదరా....నిజంగా, కుంటివాడి కాళ్ళే నయమనిపించిందంటే నమ్మ....పోనీ పారిపోదామన్నా దండగే. ఎందుకంటే, నేను అప్పటికే. శత్రువుల ప్రదేశంలో పడివున్నా. వాళ్ళు నన్ను ఏ క్షణంలోనైనా ఖైదీగా పట్టుకపోతారు.

ఇలాటి అనుకోని సంఘటనలు, యుద్ధంలో అనేకం జరుగుతూంటాయ్. స్వయంగా అనుభవించినవాళ్ళు తప్ప మిగతావాళ్ళు వాట్ని నమ్మలేరు.

టాంకుల రొద వినపడటంతో నా ఆలోచనలకి బ్రేకుపడింది. నాలుగు జర్మను మీడియమ్ టాంకులు, రాకాసి ధ్వని చేసుకుంటూ దూసుకపోయాయ్....ఎటూ ? నాలారీ వచ్చినవైపు, అంటే మాదళం వైపుకన్నమాట! అప్పుడు నా మనసు ఎంత ఆరాటపడిందో నువ్వే ఊహించుకో! ఆ తర్వాత, తుపాకులతో నిండిన 'ట్రాక్టర్లూ' కొల్బలాలూ, 'మొబైల్ కిచెనూ' అన్నీ. ఒకదానితర్వాత ఒకటి వెన్నంటి వెళ్ళాయ్. వాట్ని చూడటానికి రోతపుట్టి, నా ముఖాన్ని, గడ్డిలో దాచుకున్నా. అవన్నీ వెళ్ళిపోయాయనుకుని. నా తల పైకెత్తాను. నాకు వందగజాలదూరంలో ఆరుగురు జర్మన్' సబ్‌మిషిన్ గన్నర్స్' వెళ్తున్నారు. వాళ్ళు నన్నుచూసి, నా వైపు వస్తున్నారు. సరే అయితే నా అంత్యక్షణాలు సమీపించాయ్ అనుకుని పడుకుని చావటం ఇష్టంలేక కూర్చున్నా. వాళ్ళు నా దగ్గరకొచ్చారు. నేను నెమ్మదిగా నిలుచున్నా....ఏమనుకున్నాడో గాని, వాళ్ళల్లో ఒకడు, తటాల్న వేళ్ళాడుతున్న తుపాకిని తీసుకుని, నాకు గురిపెట్టాడు. తమాషా ఏంటంటే సోదరా, నా ప్రాణం వాళ్ళ చేతిలో అల్లాడుతున్నా....అదేమిటో నాకుకొంచం కూడా భయమేయలేదయ్యా....నువ్వు నమ్మవ్ లే. నాకు తెల్సు, అయినా అదిమటుకు నిజం. వాడు నన్ను ఎక్కడ షూట్ చేస్తాడా అనిమాత్రం చూస్తున్నా.

వాడు యువకుడే. కండలు తిరిగి మంచి బలంగా వున్నాడు. కాని, వాడి పెదవులు మాత్రం, దారంకన్న సన్నగా వున్నాయ్ ... వాడి కళ్ళల్లో రాక్షసత్వం కొట్టొచ్చినట్టుగా కనిపిస్తోంది....అ! వాడు షూట్ చేసేముందు వెనకాముందూ ఆలోచించేరకం మాత్రం కాదు. ఆ విషయం వాడికళ్ళే చెబుతున్నాయ్....వాడిచెయ్యి 'ట్రిగ్గర్' మీదకి పోయింది. నేనేమీ మాటలాడకుండా, వాడికళ్ళల్లోకి సూటిగా చూస్తున్నా. వాళ్ళల్లోనే ఒకడు. వాడికంటే పెద్దవాడేలే, వాణ్ని ప్రక్కకు తోసేసివుండకపోతే. నేనీపాటికి. నీతో మాటలాడుతుండేవాణ్నికాదు....అదంతా అనుకోని విధంగా జరిగింది. అసలు నా జీవితమే అంతలే. అన్నీ అనుకోని సంఘటనలు, విచిత్ర సంఘటనలు. వాడు ఏదో వాళ్ళ భాషలో అరుస్తూ, నాదగ్గరకొచ్చి నా మోచేతిని వంచిచూసి, 'హోహో' అంటూ ఏదేదో అన్నాడు. వాడి ముఖం చూస్తే నా పరిస్థితికి, జాలిపడుతున్నట్టుగా కనిపించాడు వాడు, రోడ్డువైపు చూపిస్తూ. నాతో వాళ్ళభాషలో ఏదో అంటున్నాడు. వాడి ఉద్దేశ్యం, బహుశా, నన్నాదారంట పారిపొమ్మనో ఏంటో.... నాకేం అర్థంకాలేదు మరి ...

ఆ మొదటివాడు మటుకు, నా బూట్లవంకచూస్తూ, తనకు కావాలన్నట్టుగా చేత్తో సంజ్ఞచేశాడు....మంచిబూట్లే అయినా పోన్లే అనుకుని కూర్చుని, విప్పాను....వాడు బూట్లు తీసుకున్నాక, నా మేజోళ్ళు కూడా విప్పి, ఇవ్వబోతే వాడికి కోపమొచ్చినట్టుంది.... వాడు మళ్ళీ తుపాకి తీసుకున్నాడు, దాంతో ఆ తక్కినవాళ్ళంతా విరగబడి నవ్వటం మొదలెట్టేరు.... ఉడికిపోయి, వాడి ముఖం నల్లగా మాడింది....ఆ తర్వాత వాళ్ళంతా వెళ్ళిపోయారు. వాడు మటుకు, రోడ్డుమలుపు తిరిగేవరకూ, నన్ను మూడు సార్లయినా చూసివుంటాడు. వాడికళ్ళల్లో, నన్ను మింగేయాలన్నంత కోపం స్పష్టంగా కనిపించింది...

ఉన్న సత్తువనంతా కూడగట్టుకొని. నడక ప్రారంభించా. మాతృదేశం మీది భక్తి నాలో ఆవేశం కలగచేస్తోంది....నేను రోడ్డు మీదకు చేరుకునే లోపున, అది పరిధులుదాటి, నావళ్ళంతా వేడెక్కింది....ఆ వేడిలోనే, ఏదో తీవ్రమైన ప్రతిజ్ఞ పట్టి, పడమటి దిక్కుగా ప్రయాణం చేశా. (సశేషం)

---

## గడచిన దారి

(24వ పుట తరువాయి)

ప్రదాతలుగా ప్రస్తుతించి,శత్రువులను వెను దరపడానికి వారితోచేరారు.

1945 వసంతంలో సోవియట్ సేనలు బెర్లిన్‌పై దండయాత్రను మొదలు పెట్టాయి. మే 2వ తేదీని జర్మన్ ప్రభుత్వ భవనంపైని విజయారుణ పతాక ఎగిరింది. బెర్లిన్‌కు పడమరనున్న ఎల్బ్‌నదివద్ద, యుద్ధఫలితం పూర్తిగా సువిదితమైన తరువాత 1944 వేసవిలో మాత్రమే ఫ్రాన్సులోదిగిన అమెరికన్, బ్రిటిష్, ఫ్రెంచి సేనలను సోవియట్ సేనలు కలుసుకున్నాయి. నిర్నిబంధంగా లొంగుబాటు పత్రంపైని జర్మనీ సంతకం చేసింది. మహావిజయోత్సవం వచ్చింది. సోవియట్ ప్రజలకు ఎన్నో కష్టనష్టాలను కలుగజేసిన యుద్ధంలో గొప్ప త్యాగాలుచేసి సాధించుకున్న విజయం యిది; శ్రమజీవనరంగంలోనూ, యుద్ధరంగంలోనూ ఎంతో శ్రమదమాదులుపడి చేసిన కృషిఫలితంగా లభించినదిది. ఫాసిజాన్ని ఓడించి సోవియట్ ప్రజలు మహావిజయాన్ని సాధించుకున్నారు. కాని జర్మనీని విచ్ఛిన్నం చేయడంగాని, నాశనం చేయడంగాని ఎన్నడూ వారి ఉద్దేశంకాదు; వారు ఎన్నడూ ఎటువంటి ప్రతీకారాన్నీ ఉద్దేశించలేదు.

దేశభక్తి ప్రపూరిత మహాయుద్ధం సోవియట్ ప్రజల విజయ సాధనతో ముగిసింది, సోవియట్ దేశ శ్రామికప్రజలు తమ శాంతియుత కృషికి మళ్ళగలిగారు.

("సోవియట్ భూమి" 22వ సంచికలో మిగతా)

# డౌనట్



ఒకప్పుడు, ఒక వృద్ధుడు, భార్యతో వుంటూ వుండేవాడు.

మంచి రోజున, ఒకమాటు భార్యతో, "పోయి, పిండి డబ్బా గీరి అంతపిండీ, గాదె ఊడ్చి అన్నిగింజలూ పోగుచేసి, ఎట్లాగైనా ఇవ్వాళ తింటానికి మనకో డౌనట్ చెయ్యి" మన్నాడు.

వెంటనే వెళ్ళి ఆ ముసల్ది, పక్షిరెక్కతో పిండి డబ్బా గీరి రెండు దోసెళ్ళ పిండీ, గాదె ఊడ్చి అన్ని గింజలూ పోగు చేసు కొచ్చింది.



ఆ పిండిని చక్కగా మర్దించి, వుండకట్టి, అందులో పులిసిన మీగడ కూరి, వెన్నపూసతో ఎర్రగా వేయించి చక్కటి డౌనట్ చేసి, చల్లారడానికని కిటికీ గట్టుమీద పెట్టింది.

కాసేపు ఆ డౌనట్, కిటికీలో ఆ ముసల్ది పెట్టినట్టు పెట్టిన చోటే వుంది. ఆ తర్వాత లేచి, దొర్లడం మొదలుపెట్టింది తిన్నగా కిటికీలో నుంచి బెంచీమీదికి దొర్లింది. నెమ్మదిగా బెంచీమీదినుంచి నేలమీదికి దొర్లి, అక్కడినుంచి దొర్లుకుంటూ దొర్లుకుంటూ గడప



దగ్గరకుపోయింది. గడపదాటి తిన్నగా ఒకమెట్టు తర్వాత ఒకమెట్టు దిగి, గుమ్మం ముంగిట్లోకి వచ్చి, అక్కడినుంచి వీధి గుమ్మందాటి, ఆ దారి పొడుగునే దొర్లుకుంటూ దొర్లుకుంటూ ఎంతో దూరం పోయింది.

పోగా పోగా దానికో చెవులపిల్లి ఎదురయింది.

"డౌనట్, డౌనట్ నేను నిన్ను తినేస్తాను" అంది ఆ చెవులపిల్లి.

"వొద్దు, నన్ను తినెయ్యకు, నీకో చక్కటి పాట వినిపిస్తా" నంది డౌనట్.

"నేనా, నేనొక గుండ్రటి డౌనట్,
ఎర్రగ, వెన్నన కాగిన డౌనట్,
గీరగ డబ్బా పిండీ నిచ్చె,
ఊడ్చగ గాదె గింజాలిచ్చె,
నేనా, నేనొక గుండ్రటి డౌనట్.

మిసమిసలాడే మీగడ కూరి,
సలసల్లాడే వెన్నన కాచిరి,
చల్లబడితే తిందామని చూచిరి,
నేనా, నేనేంకాదు అంత వెర్రిదాన్ని!

తాతా నోటా పడలేదూ,
అవ్వానోటా పడలేదూ,
ఓహో! ఓచెవుల పిల్లి,
నువ్వూ నను మింగలేవు!"

చెవులపిల్లి కన్నుమూసి తెరిచేలోపల, అంతలోనే మాయమైంది డౌనట్. దొర్లుకుంటూ దొర్లుకుంటూ పోగాపోగా, ఆడౌనట్‌కి ఒక బూడిద వర్ణపుతోడేలు కనిపించింది.

"ఓ డౌనట్, డౌనట్ నిన్ను నేను తినేస్తాను" అంది ఆ తోడేలు.

"తోడేలా, తోడేలా నన్ను తినెయ్యకు, నీకోమంచి పాట వినిపించనీ" అన్నది డౌనట్.

"నేనా, నేనొక గుండ్రటి డౌనట్,
ఎర్రగ, వెన్నన కాగిన డౌనట్,
గీరగ డబ్బా, పిండీ నిచ్చె,
ఊడ్చగ గాదె, గింజా లిచ్చె,
నేనా, నేనొక గుండ్రటి డౌనట్.

మిసమిసలాడే మీగడ కూరి,
సలసల్లాడే వెన్నన కాచిరి,
చల్లబడితే తిందామని చూచిరి,
నేనా, నేనేంకాదు అంత వెర్రిదాన్ని!

తాతానోటా పడలేదూ,
అవ్వా నోటా పడలేదూ,

చెవ్వుల పిల్లికి చిక్కాలేదూ,
నువ్వూ, నను మింగేందుకు
వచ్చావా ఓ తోడేలా, వదవద నే చిక్కను!"

పాట ముగిసిందో లేదో, తోడేలు కన్నుమూసి తెరచేలోపల మాయమైంది డౌనట్.

పోగాపోగా దానికో ఎలుగుబంటి ఎదురయింది.

"డౌనట్, డౌనట్ నిన్ను నేను తినేస్తా"నంది ఎలుగుబంటి.

"నువ్వేనా, నువ్వు నన్నేం తింటావ్. దొడ్డికాళ్ళ పెద్దమ్మా!"

"నేనా, నేనొక గుండ్రటి డౌనట్
ఎర్రగ, వెన్నన కాగిన డౌనట్
గిరగ డబ్బా, పిండీ నిచ్చె,
ఊడ్చగ గాదె, గింజాలిచ్చె,
నేనా, నేనొక గుండ్రటి డౌనట్.

మిసమిసలాడే మీగడ కూరి,
సలసల్లాడే వెన్నన కాచిరి,
చల్లబడితే తిందామని చూచిరి,
నేనా, నేనేం కాదు అంత వెర్రిదాన్ని!

తాతా నోటా పడలేదూ,
అవ్వా నోటా పడలేదూ,
చెవ్వుల పిల్లికి చిక్కాలేదూ,
తోడేల్ చేతికి చిక్కాలేదూ
నీకూ, ఓ ఎలుగుబంటి చిక్కనులే నేను!"

రెప్పపాటులో ఎలుగుబంటి దగ్గరనుంచి తప్పించుకపోయింది డౌనట్.

పోయిపోయి అదొక గుంటనక్కను కలుసుకొన్నది.

"డౌనట్, డౌనట్, ఎక్కడికి వెళ్తున్నావు దొర్లుకుంటూ, దొర్లుకుంటూ?"

"కనిపిస్తూనే వుందిగా, ఈ దారినే పోతున్నాను."

"డౌనట్, డౌనట్ ఒక మంచి పాట పాడు!"

నక్క అడగడంతోటే డౌనట్ పాట మొదలుపెట్టింది:

నేనా, నేనొక గుండ్రటి డౌనట్,
ఎర్రగ, వెన్నన కాగిన డౌనట్,
గిరగ డబ్బా, పిండీ నిచ్చె,
ఊడ్చగ గాదె, గింజా లిచ్చె,
నేనా, నేనొక, గుండ్రటి డౌనట్.

మిసమిసలాడే మీగడకూరి,
సలసల్లాడే వెన్నన కాచిరి,
చల్లబడితే తిందామని చూచిరి,
నేనా, నేనేం కాదు అంత వెర్రిదాన్ని:

తాతా నోటా పడలేదూ,
అవ్వా, నోటా పడలేదూ,



చెవ్వుల పిల్లికి చిక్కాలేదూ,
తోడేల్ చేతికి చిక్కాలేదూ,
ఎలుగుబంటీ మింగా లేదూ
దక్కనులే నీకూ ఓ గుంటనక్క!"

అది విని అన్నది గుంటనక్క:

"ఓహో! ఎంత కమ్మటిపాట! ఈ పాడు చెవులకు అంత బాగా వినిపించదు. ఇదిగో, ఓ డౌనట్, కాస్త ఇట్లావచ్చి, నా



ముట్టెమీద కూర్చొని, కొంచెం బిగ్గరగా పాడుదూ, కాస్త అప్పుడన్నా వినగలుగుతాను."

చెంగున ఒక్క గంతేసి, గుంటనక్క ముట్టెమీద కూర్చుని డౌనట్ మళ్ళీ ఆ పాటే పాడింది బిగ్గరగా.

"మిత్రమా, ఎంతోసేపు పట్టదుగాని నీకు, కాస్త నా నాలుక మీద కూర్చుని పాడుదూ!" నక్క అడగ్గానే డౌనట్, దాని నాలుక మీదకు దూకింది, గుటుక్కున....దాన్ని మింగేసింది గుంటనక్క.



# నూతన



వి. ఐ. లెనిన్ అధ్యయనం చేసిన కజన్ విశ్వవిద్యాలయం

ఓల్గా మీదుగా పడవలో ప్రయాణం చేస్తూ 1952 వేసవిలో, స్త్రవ్రాపోల్ నగరపు చిన్న వారధి స్తంభం వద్ద ఆగాను. అందానికి పేరుపడ్డ జిగులి కొండలకు ఎదురుగా వుందిది. కర్రయిళ్ళుగల యీ చిన్న నగరం కనిపించీ కనిపించకుండా వుంది, నది పల్లపు ఒడ్డు యిసుకలో అది కదలియాడుతూవుంటే. ఈ చిన్న పట్టణం, యిప్పటికే బాగా పేరుపడింది. జిగులీ కొండలకూ స్త్రవ్రాపోల్‌కూ మధ్యను ప్రపంచమంతటికీ గొప్పదైన జల విద్యుత్కేంద్రాల నిర్మాణం—కుయ్‌బిషెవ్ జియియస్ నిర్మాణం—సాగింది. ఎక్స్‌కవేటర్లు అహోరాత్రులు కాఫర్‌డామున త్రవ్వుతూ పనిచేశాయి; సక్షణ డ్రెడ్జీలు డాముకోసరం మట్టిని నింపాయి. నదీతీరాన కాంక్రీట్ ఫాక్టరీల కట్టడాలు వెలిశాయి; నిర్మాతల పేటలు లేచాయి. కాని మామూలు విధంగా ఓల్గాపైని పొగటడలూ, బార్జీలు పోకుండా యివేవీ ఆటంక పర్చలేదు.

నేడు జిగులీ కొండలకు సమీపంలోని ఓల్గా ప్రాంతాన్ని పోల్చుకోలేము. కుయ్ బిషెవ్ నదినుండి పడవమీదుగా నదిలో పోతోంటే, లాకుయొక్క పెద్ద గేట్లవద్ద మీరు ఆగవలసివుంటుంది. కొద్ది నిమిషాల తరవాత, గేట్లు తెరిచిన తరవాత, మీ పడవ ఒక ఫ్రైటర్‌తోనూ, ఒక లో ఆయిల్ బార్జితోనూ, ఒక టోటోటుతోనూ లోతయిన లాకులోనికి వెళ్ళిపోతుంది. లాకు నీటితో నిండివున్నప్పుడు పడవలు తరవాత లాకులోనికి వెళ్ళిపోతాయి.

ఓల్గాకు అడ్డంగా వున్న యీ డాము—యిది రెండు కిలోమీటర్లలకు పైగావుంది నదిమట్టాన్ని 25 మీటర్లు హెచ్చించింది. లాకునుండి చూస్తే జిగులీ కొండలకు చేరువలోని లోతయిన ఒడ్డుపైనున్న జల విద్యుత్కేంద్రం, ఎత్తుగా వున్నట్టుగా కనిపించనే కనిపించదు. అయినా, మీరు కట్టడంలో ప్రవేశించినట్టయితే, యంత్రాలుగల దాని ఎత్తుకూ, వైశాల్యానికీ ఆశ్చర్యపడతారు. విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసే జనరేటర్లను పద్దాలుగు హైడ్రో టర్బయన్లు నడిపాయి. హై ఓల్టేజ్ ప్రసారంకోసం అంతులేని వరసగా ఉక్కు స్తంభాలున్నాయి. ఇవి పవర్‌స్టేషణ కట్టడం వద్దనుండి చాలా దూరానికి విస్తరించి వున్నాయి. నాలుగు లక్షల ఓల్టుల టెన్షన్‌తో విద్యుచ్ఛక్తి యీ తీగలలోనుంచి పోతుంది. ఇప్పటికే నడుస్తూవున్న వాటి చేరువను యితర యూనిట్లు అమర్చబడుతున్నాయి. అక్టోబరు విప్లవం 40వ వార్షికోత్సవం నరికి కుయ్‌బిషెవ్ జియియస్ పూర్తి కెపేసిటీతో—2,100,000 కిలోవాట్లు—పనిచేస్తూ వుంటుంది.

ఈ బ్రహ్మాండమైన విద్యుదుత్పాదక సంస్థను నడుపుతోన్న మహత్తరశక్తి ఏది? జలాశ్రయంలో 58 క్యూబిక్ కిలోమీటర్ల ఓల్గానదినీరు చేర్చబడింది. కొత్తగాపుట్టిన కుయ్‌బిషేవ్ "సముద్రం" 6,500 చదరపు కిలోమీటర్లకు వ్యాపించివుంది. ప్రపంచం అంతటికీ యిది పెద్ద కృత్రిమ జలాశ్రయం.

దేశపు ఆ భాగంలో భౌగోళిక పరిస్థితులలో తీసుక రాబడిన మార్పులకు అర్థమైనవిగా వున్నాయి, యీ వివరాలు. పాతకాలపు చిన్న స్త్రవ్రపోల్ చిహ్నమే ఎక్కడా లేదు. అది ఒకప్పుడున్న చోట యిప్పుడు మీరు కెరటాల చప్పుళ్ళు వినవచ్చును. కాని యింకా ఎగువను, పూర్వం దట్టమైన దేవదారువనం వున్నచోట, కొత్త స్త్రవ్రపోల్ నిర్మింపబడింది. ఇది చాలా కిలోమీటర్ల భూభాగానికి వ్యాపించి వుంది. రెండు, మూడంతస్తుల రాతియిళ్ళిప్పుడు కోమ్సొమోల్‌స్క్, ఓడరేవు నగరం, ష్లుయుజోవీ (లాకు) పేట అన్న వాటిగా ఏర్పడ్డాయి. ఇవన్నీ విశాలమైన తారురోడ్లద్వారా ఒకదానితో ఒకటి సంబంధం కలిగివున్నాయి. ఈ రహదారిపైని మోటారు బస్సుల రాకపోకల రద్దీ ఎక్కువగా వుంటుంది. కొత్త యిళ్ళకు గ్యాసు పొయ్యిలూ, విద్యుద్దీపాలూ, కొళాయిలు, మురుగునీటి పైపులూ మొదలైనవి వున్నాయి. కుయ్‌బిషేవ్ విద్యుత్కేంద్ర నిర్మాణంలో బాటుగా ఐదు లక్షల చదరపు మీటర్లకు పైగా నివాసస్థలంలో కట్టడాలు, 40కి పైగా పాఠశాలలూ, శిశుపోషణాలయాలూ, బాలోద్యాన వనాలూ, 10 క్లబ్బులూ, 60 స్టోర్లూ నిర్మింపబడ్డాయి.

కొత్త స్త్రవ్రాపోల్ రేపుగానే కాకుండా, ట్రాన్స్ ఓల్గా ప్రాంతపు ఒక పెద్దసాంస్కృతిక కేంద్రంగా కూడా అభివృద్ధి చెందుతోంది. పారిశ్రామిక విద్యాసంస్థ కట్టడాలు, నగరపు మధ్య వీధుల్లో ఒకదానికి ప్రారంభంగా వున్నాయి. సుమారు వెయ్యిమంది నిర్మాణ కార్మికులు సాయంత్రం దానికి వెళ్తారు. వారు ఇంజినీర్లు, హైడ్రో

# సముద్రతీరాన

ఎస్. మొరొజోవ్

టెక్నీషియన్లు, మెకానిక్కులు, విద్యుచ్ఛక్తి ప్రవీణులూ కావడానికి వారు చదువుకుంటున్నారు.

కొత్త సముద్రం మీదుగా వెళ్ళి, తమ కొత్తయిళ్ళలో వీరెలా జీవిస్తున్నారో చూద్దాం పదండి.

పైలట్ గదిలో ఒక మ్యాపు వుంది; నౌకాయాన మార్గాలను సూచించే చుక్కలలో, ఇవి కొన్నిచోట్ల చుట్లుతిరిగి వున్నాయి. కొన్నిచోట్ల కుడివేపుకు వరదకప్పిన పచ్చిక బయళ్ళపైన వున్నాయి.

యగొద్నొయ గ్రామాన్ని సమీపిస్తుంటే, యీ గ్రామం పూర్వం యిప్పుడు నీరుగల పల్లపు తీరాన వుండేదని మాకు జ్ఞాపకం వచ్చింది: నూతులనుండి చేతులతో నీరు తోడవలసివచ్చేది. ఇప్పుడు ప్రతి వీధుల కూడలిలోనూ కొళాయిలున్నాయి. అక్కడి రైతుల యిళ్ళు పునర్నిర్మింపబడ్డాయి, చుట్టూరా పళ్ళ తోటలతో అవి చాలా అందంగా కనిపిస్తాయి. కొత్త భూములకు వెళ్ళి కాపురం పెట్టిన రైతులు తమ ఆపిలు చెట్లను, రాస్పబెర్రీ బ్లాక్ క్యురంట్, గూస్ బెర్రీ పొదలనూ కూడా తీసుకవెళ్ళి నాట్లు వేశారు,

"మేము సముద్రతీర నివాసులమైపోయినాము" అన్నాడు ముసలి సమిష్టిరైతు క్రిసెయిఫ్ టొకరేవ్. ఆయన చిరునవ్వుతూ చాలా చేపల పడవలను చూపాడు: "ఇప్పుడు మాకు చేపలవేటకు చాలా స్థలాలున్నాయి."

యగొద్నొయిలోని చేపలవేట సంఘం కుయిబిషెవ్ "సముద్ర" తీరానగల కొత్తగా నిర్మించిన చాలా సంఘాలలో ఒకటి. ప్రభుత్వపు చేపలవేట సంస్థ, మోటారు బోట్లపైని చేపలవేటకు సంబంధించిన కేంద్రాలూ సమిష్టి రైతులకు పెద్ద వలలనూ, మోటారు బోట్లనూ, డ్రిఫ్టింగ్ వలలనూ, ఒక్క మాటలో చెప్పాలంటే సంఘానికి అవసరమైన ప్రతి ఒక్కదానినీ సరఫరా చేస్తాయి. చేపల సంఖ్య వృద్ధి అయ్యేందుకుకూడా ప్రభుత్వం చర్యలు తీసుకుంటుంది. ఈ వసంతంలో కొత్త జలాశ్రయానికి అది అనేక లక్షల చేపపిల్లలను పంపింది.

మా యాత్రలో రెండోరోజున, ముఖ్య నౌకాయాన మార్గం నుంచి మేమొక విశాలమైన అఖాతంలోనికివెళ్ళాము. ఇది మ్యాపుల్లో ఛెరెంషన్ నదీ ముఖద్వారంగా పేర్కొనబడింది. కాని మాకు ముఖ్యంగా ఆసక్తిని కలగించినది, మెలెకెస్ నగరం. ఇది ఓల్గాకు 135 కిలోమీటర్ల దూరాననే వుండి ెప్పుడూ. ఇప్పుడు ఛెరెంషన్ తన నీటిని వ్యాపింపజేసింది, యీ నగరంవరకూ నీళ్ళు వచ్చాయి.

మా పడవ కాంక్రీట్‌లో కట్టిన స్థావరంలో లంగరు వేసింది, ఒక చిన్న ప్రయాణీకుల పొగ ఓడ ప్రక్కను.

"ఇక్కడ నౌకాయానాన్ని మెలెకెస్‌లో మొదటిసారిగా మొదలు పెట్టింది మేమే" అన్నాడు రేవు అధిపతి మిఖయిల్ క్రసనోవ్. ఇప్పుడు మావద్దకు ఉల్యనోవ్‌స్క్‌నుండి ఓడలు వస్తున్నాయి. ముఖ్యంగా రవాణా చేయబడే దినుసు ధాన్యం." చెట్ల వెనకనుండి ధాన్యపు ఎలివేటర్ల గోపురాలు కనిపించే దిక్కుగా క్రసనోవ్ మాకు పట్టణంవేపు చూపాడు. ఉల్యనోవ్‌స్క్ మండలపు జిల్లా కేంద్రమైన మెలెకెస్‌కూడా రైలు మార్గంలో వుంది. కాని ఇప్పుడక్కడికి ఒక "సముద్రం" వచ్చింది గాబట్టి, చవకగావుండే జలమార్గాన్ని ఉపయోగించడం చాలా లాభదాయకంగా వుండేటప్పుడు రైల్వేమీద భారంమోపడం ఎందుకు?

ఉల్యనోవ్‌స్క్‌కు మా ప్రయాణం సాగించాం. దానికి అది చాలాదూరంగా వున్నప్పుడు సైతం, అది ఎత్తయినచోట వుండడం వల్ల, దానిని మేము చూడగలిగాం. ఓల్గా తీరానగల చాలా అందమైన నగరాలలో అదొకటి; అది వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్ పుట్టినచోటు.... వారధి స్తంభంవద్దనుండి నగరానికి ఎత్తయిన మెట్ల వరస వుంది. అక్కడ విశాలమైన చౌకులో అద్భుతమైన లెనిన్ విగ్రహం వుంది. యాత్రికులతో వున్న మోటారు బస్సులు, తీరంలోని ప్రయాణీకుల స్టేషన్‌నుండి ఎప్పుడూ బయలుదేరుతూనే వుంటాయి. ప్రయాణీకులలో ఓల్గాపైని తమ సెలవులను గడిపే సోవియట్ దేశ యాత్ర చేసే విదేశీ అతిథులూ వుంటారు. చెట్ల నీడలలోవున్న, చాలా పురాతనమైన చెట్టు బారులుతీర్చి వున్న ఒక యింటిని చూడడానికి వారందరూ ఆతృతగా వున్నారు. ఆ యింటికి యీ విధంగా వ్రాసివున్న ఫలకం



ఉల్యానోవ్‌స్క్‌లోని లెనిన్ విగ్రహం

అమర్చివుంది : "వ్లాదిమిర్ ఉల్యనోవ్-లెనిన్ 1878-1887 సంవత్స రాలలో యిక్కడ జీవించారు."

గదులలో బాగా వెలుతురుంది, అవి పరిశుభ్రంగా వున్నాయి. సదుపాయంగా సామగ్రి అమర్చి వుంది. సామ్యవాద విప్లవ ప్రతిభా శాలిని మానవజాతికి ప్రసాదించిన ఆ అద్భుతమైన రష్యన్ కుటుంబం, ఉల్యనోవ్ కుటుంబ యిల్లు అది పూర్వం వున్న విధంగా భద్రపర్చడానికి ప్రేమ, శ్రద్ధ చూపబడ్డాయి.

తెల్లని దుప్పటి కప్పివున్న సామాన్యమైన లోహపు మంచం గల లెనిన్ బాల్యంలో నివసించిన గది, గోడకున్న అర్ధగోళ పటమూ, పూర్వపు సింబిర్స్క్ పాఠశాలగా వున్న విశాలమైన రాతి యిల్లు, మ్యునిసిపల్ పార్కులోని నీడలుపడి వున్న సందులూ— యిక్కడే బడి కుర్రవాడైన ఒలోద్యా ఉల్యనోవ్ ఆడుకునే వారు, ఓల్గాను చూసి ఆనందించేవారు—యివన్నీ లెనిన్ బాల్యాన్ని జ్ఞాపకం తెస్తాయి.

అధునాతన ఉల్యనోవ్స్క్ ఆ మహాచార్యుని ఎన్నెన్ని భావాలకు ఉత్తేజాన్నిచ్చిందో! పాత నగరం సింబిర్స్క్‌కు దీనికీ పోలికే లేదు. మోటారు కార్లనూ, లేత్‌లనూ, ఎలెక్ట్రిక్ మోటారులనూ, ఇంటర్నల్ కంబశ్చన్ యింజిన్లనూ తయారుచేసే కొత్త పరిశ్రమలు రాగానే, దాని సరిహద్దులు విస్తరించాయి. ఉన్నతమైన నివాస గృహాలు వచ్చి, ఎన్నో కొత్త వీధులతో పెద్దపెద్ద యిళ్ళ కట్టడాలు ఏర్పరిచాయి. కొత్తగా మళ్ళీ పుట్టిన ఓల్గా, లోతయిన ఒడ్డువద్ద తన నీటిని సముద్రంలో పోస్తూ, దేశ విద్యుదీకరణకు లెనిన్ యొక్క ప్రతిభావంతమైన పథకానికి సజీవ మూర్తిగా వుంది.

మేము సంతోషంగా ప్రయాణం సాగించాము. ఐదువందల కిలోమీటర్లు గడిచి వెళ్ళాము. కాని జలతలం ముందరివలెనే విశాలంగా సువ్యాప్తంగా వుంది. జలాశ్రయం కజన్‌వరకూ వ్యాపించి వుంది.

కజన్‌వేపు నీటిమీద మేమొకప్పుడు ప్రయాణంచేసే సంవత్సరాలలో నగరంవేపు దూరదర్శినులతో చూసేవాళ్ళమన్న సంగతి జ్ఞాపకం రాకుండా వుండదు. కజన్, ఓల్గా నగరాలలో ఒక అతి పురాతన నగరం. అక్టోబరు విప్లవానంతరం అది స్వపరిపాలక సోవియట్ తాతార్ రిపబ్లిక్‌కు ముఖ్యపట్టణమైంది. పాత రోజుల్లో అది నదికి చాలా దూరంగా వుండేది. నేడు కజన్‌కు ఓడలు వెళ్ళేటప్పుడు, నగరమధ్యానికి ఒక బారెడు దూరాన మాత్రమేగల ఒక కొత్త రేవులో అవి నిలుస్తాయి కాంక్రీటులోనూ, రాతిలోనూ ఒక కోటి క్యూబిక్ మీటర్ల మట్టి పోయబడింది. ఇరవై ఐదు కిలోమీటర్లకు పైగా కజన్‌చుట్టివేసేగట్లు యిప్పుడక్కడ వున్నాయి. వరదల నుండి యివి నగరానికి మంచి రక్షణ.

కొత్త కజన్ నగరం పనిపాటలతో మంచి సందడిగా వుంటుంది. ఉరల్సనుండి లోహాన్ని, గోర్కీ నుండి మోటారు కార్లనూ, స్టాలిన్‌గ్రాడ్ నుండి ట్రాక్టర్లనూ, యరొస్లావ్ నుండి రబ్బరునూ, డాన్బస్‌నుండి బొగ్గునూ తీసుకవచ్చే పడవలనుండి క్రేన్లు బరువులను దింపుతున్నాయి. బాకూనుండి, తతారియానుండి, బష్కీరియానుండి వచ్చే నూనె పెద్దపడవలలో నుండి ఎండలో మెరిసే తెల్లని పీపాలలోనికి నింపబడుతోంది.

మాస్కోకు, ఉఫాకు, రోస్తవ్‌కు, గోర్కీకి, ఆస్త్రఖాన్‌కు, స్వెర్ద్లవ్‌స్క్‌కూ కజన్‌గుండా ప్రయాణీకుల ఎక్స్‌ప్రెస్ రైలుబళ్ళు ఎప్పుడూ పోతూవుంటాయి.

కజన్ మధ్యలోనూ, పొలిమేరలలోనూ కొత్త భవనాలు లేస్తున్నాయి. లియో టాల్‌స్టాయి, వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్ ఒకప్పుడు చదివిన ప్రాచీన విశ్వవిద్యాలయానికి దగ్గరోనే, విజ్ఞానశాస్త్ర పరిషత్తు శాఖ ఒకటి నిర్మింపబడింది. స్వాతంత్ర్య చౌకుకు యిప్పుడొక కొత్త చేర్పు వచ్చింది, అది తాతార్ సంగీత, నృత్యనాటక శాల. పూర్వం నగరానికి పొలిమేరగా వున్నచోట యిప్పుడో విమానాశ్రయం వుంది. నగర మధ్యానికీ, దీనికీ తారుతో రహదారి వేయబడింది. మాస్కో నుండి పసిఫిక్ మహాసముద్రం వరకూ విస్తరించిన గొప్ప విమాన మార్గం యొక్క పెద్ద రవాణా కూడలులలో యిది ఒకటి.

విశ్వవిద్యాలయంకాక కజన్‌కు యింకా తొమ్మిది ఉన్నత విద్యాసంస్థలూ, చాలా సాంకేతిక పాఠశాలలూ వున్నాయి. ఇవన్నీ సోవియట్ పరిపాలనాకాలంలో ప్రారంభింపబడినవే. తాతార్లు, రష్యన్లు, బష్కీర్లు, చువాష్‌లూ, మారీలు, మోర్ద్వియన్లు—వివిధ జాతుల ప్రజల యీ ప్రతినిధులందరూ యిక్కడ చదువుకొని యింజినీర్లు, టెక్నిషియన్లు, డాక్టర్లు, ఉపాధ్యాయులూ, వ్యవసాయ శాస్త్రజ్ఞులూ, విజ్ఞానశాస్త్రజ్ఞులూ, సంగీతవేత్తలూ, నటులూ అవుతారు.

ఒక సముద్రాన్ని నిర్మించడానికి నీటినిచ్చిన యీ రష్యన్ మహానదీతీరాన జీవితం, సోవియట్ ప్రజల అభిమతానుసారంగా, పూర్తిగా పరివర్తనను పొందింది.



నూతన సముద్రాన్ని సృష్టించను కట్టిన కొత్త ఆనకట్ట



# ఆస్త్రఖాన్లోని భారతీయుల పేట

వి. కులందా

ఓల్గా సంగమస్థానం వద్దనున్న పెద్ద రష్యన్ నగరం ఆస్త్రఖాన్‌లోని ఒక ముఖ్య వీధి పేరు "ఇండీస్కయా" (భారతీయం). ఈ పేరు వెనక మూడు వందల ఏళ్ళకు పైగా చరిత్ర దాగివుంది. ఆ దూరపు రోజుల్లో రష్యన్ విదేశ వాణిజ్యానికి ఆస్త్రఖాన్ చాలా ముఖ్య కేంద్రం, ట్రాన్స్ కకేషియన్, ఇరాన్, మధ్యాసియా వ్యాపార మార్గాలకు కూడలి. ఈ నగర వీధులు వర్తకులతోనూ, ఆ దేశాలనుండి, రష్యానుండి వచ్చిన బిడారులతోనూ కిక్కిరిసి వుండేవి. మాస్కోకు, యరొస్లావ్‌కూ, నొవొగొరోద్‌కూ వస్తువులను తీసుకెళ్తూ తొలిసారిగా భారతీయ వర్తకులు ఆస్త్రఖాన్లో, పదిహేడో శతాబ్దపు మూడో దశాబ్దంలో కనిపించారు. రష్యన్ ప్రభుత్వం భారత దేశంతో వాణిజ్యాన్ని పెంపొందించడానికి ప్రయత్నించి వాణిజ్యయాత్రలు నడిపింది. కాని ఒక సక్రమమైన వాణిజ్య బడంబడికను అది స్థాపించలేకపోయింది. 1647లో జారు చక్రవర్తి, యితర విదేశ వర్తకులకు చూపినదానికంటె భారతీయ వర్తకులకు ఎక్కువగా సదుపాయాలు చూపవలిసిందని ఆస్త్రఖాన్ గవర్నర్‌కు ఒక లేఖను వ్రాసేడు. తమ కివ్వబడిన సౌకర్యాల వల్ల భారతీయ వర్తకులు ఆస్త్రఖాన్లో స్థిరపడడానికి అవకాశం కలిగినట్టుగా కనిపిస్తోంది. 18వ శతాబ్దంమధ్యలో ఒక ప్రత్యేకమైన "భారతీయ వాణిజ్యవీధి" నిర్మింపబడింది. తరవాతనిది "ఇండీస్కయా" అని పిలువబడేది. ఇదే వీధిలో నిర్మింపబడిన ఒక హిందూదేవాలయంలో ఒక బ్రాహ్మణుడు స్థిరనివాసం ఏర్పర్చుకున్నాడు. 1760 నరికి భారతీయ వర్తకులకు ఆస్త్రఖాన్లో 78 దుకాణాలు, గిడ్డంగులు, గుర్రపుసాలలూ, ఆవులసాలలూ, వుండడానికి యిళ్ళూ భారతీయ వాణిజ్య వీధిలో, వుండేవి. ఆస్త్రఖాన్లోని అధికభాగం భారతీయ నివాసులు, వర్తకులు. కాని వారిలో చాలామంది చేతివృత్తులవారూ, వడ్డీవ్యాపారులు కూడా వుండేవారు. వీరిలో ఎక్కువమంది పంజాబ్, రాజస్థాన్లనుండి వచ్చినవారు.

భారతీయులు పట్టుబట్టలూ, నూలుబట్టలూ పొడులూ, ఉన్ని, తివాసీలూ, ధూపసామగ్రి రష్యాకు తీసుకవచ్చేవారు; చర్మం, ఫర్స్, లినెన్, కేన్వాస్, బట్ట భారత దేశానికి తీసుకవెళ్ళేవారు.

ఎనిమిదేళ్ళలో–1737–1744 మధ్య–భారతీయులు సుమారు లక్ష రూబుళ్ళ వ్యాపారం చేశారు. ఆ రోజుల్లో యిది చాలా పెద్ద మొత్తం। చెల్లించిన పన్నులబట్టి చూస్తే అమర్‌దాస్, రాందాస్, అలీంచంద్ వంటి వర్తకులు చాలా భాగ్యవంతులై వుండాలి।

రష్యన్-భారతీయ వాణిజ్యం 18వ శతాబ్దంలో చాలా జయప్రదంగా వుంది. కాని ఆ శతాబ్దం చివరను ఇరాన్లో బయలుదేరిన రాజకీయ కల్లోలాలవల్ల, దీనికి చాలా నష్టం కలిగింది. పెర్షియన్ బందిపోటు దొంగలు వాణిజ్య మార్గాలను ఛేదించారు. ఈ విధంగా భారతీయ వలసను విడగొట్టారు. దీని ఫలితంగా చాలామంది భారతీయ వర్తకులు ఆస్త్రఖాన్‌ను వదిలిపెట్టారు; 19వ శతాబ్దం ప్రారంభంలో కొద్దిమంది భిక్షాటనంచేసే సన్యాసులు, రష్యాలో పాతుకపోయిన కొంతమంది భాగ్యవంతులూ మాత్రమే ఆ నగరంలో మిగిలారు. ఉదాహరణకు భాగ్యవంతులలో సబ్రా మొగున్‌దాస్ ఒకరు. 1826 లో యీయన లక్ష రూబుళ్ళకు పైగా వ్యాపారం చేశారు. అందమైన ఆయన పెద్ద రాతియిల్లు యిప్పటికికూడావుంది. కాని తన జీవితాంతంలో మొగున్‌దాస్ తన మాతృభూమికి తిరిగి వెళ్ళాడు. 19వ శతాబ్దం మధ్యనరికి ఆస్త్రఖాన్లో ఒక్క భారతీయ వర్తకుడూ మిగులలేదు.

ఆస్త్రఖాన్లో భారతీయుల పేట రెండువందల ఏళ్ళకు పైనుండీ వుంది. ఇది రష్యన్-భారతీయ సంబంధాల అభివృద్ధికి చాలా తోడ్పడింది. ఈ రెండుదేశాల మధ్య సంబంధానికి, యిది అతిముఖ్యమైన కేంద్రం.

ఆస్త్రఖాన్ భారతీయుల జీవితాలకు సంబంధించిన సమాచారాన్ని, నేడు సోవియట్ విజ్ఞాన శాస్త్రజ్ఞులు జాగ్రత్తగా పరిశీలిస్తున్నారు గత కొద్ది ఏళ్ళలో దేశపు పురాపత్ర సంచయంలో కొత్త పత్రాలు చాలా కనుగొనబడ్డాయి. గత ఏడాది భారతీయ దేవాలయ శిథిలాలవద్ద త్రవ్వకాలు జరిగాయి. కొద్ది రోజుల్లో యీ పరిశోధనా ఫలితాలు, సోవియట్ వైజ్ఞానిక పత్రికలలో ప్రచురింపబడతాయి.

# [illegible] సోవియట్ సాహిత్యం


**ఎల్. యకిమెన్కో**

*మాస్కో విశ్వవిద్యాలయం డోసెంట్, సోవియట్ దేశ రచయితల సంఘ సభ్యులు*


సోవియట్ సారస్వతాభివృద్ధికి సంబంధించిన వ్యాసావళిలో యిది మూడవది.
మొదటి రెండూ మా పత్రిక 18, 19 సంచికలలో ప్రచురింపబడ్డాయి.

సోవియట్ దేశంలో యుద్ధానికి ముందరి దశలోని అత్యంత ముఖ్యమైన సారస్వత సంఘటన, నిస్సందేహంగా ప్రథమ అఖిల సమాఖ్య సోవియట్ రచయితల మహాసభ.

1934 ఆగస్టులో జరిగిన మహాసభ కృషిపైని, అప్పుడున్న పరిస్థితుల ప్రభావం బాగా పడింది. అపూర్వగతిలో నిర్మాణం సాగుతూవుండేది. కొత్త ఫాక్టరీలు, పరిశ్రమలు, గనులు, విద్యుత్కేంద్రాలూ దేశంలోని చాలా భాగాలలో నిర్మింపబడుతూ వుండేవి. నగరాలకు నగరాలే లేస్తూవుండేవి.

అందువల్ల 52 సోదర జాతీయ సారస్వతాలకు చెందిన 597 మంది ప్రతినిధులు సహజంగా, కాలావసరాలను అనుసరించి రచన చేయాలనీ, తమ దేశ స్వరూపాన్ని మార్చివేస్తోన్న గొప్ప పరివర్తనలలో సారస్వతం పాత్ర గురించి ప్రసంగించారు. అనైక్యతను ఖండిస్తూ, అధికమైన సృజనాత్మక కృషికి సంఘీభావం ముఖ్యావశ్యకమని నొక్కి చెప్పారు.

"పార్టీ, ప్రభుత్వమూ సోవియట్ రచయితలకు సర్వమూ యిచ్చాయి!" అని ప్రకటించారు యల్. సొబొలెవ్ అందరి ప్రతినిధుల అభిప్రాయాలనూ వ్యక్తపర్చుతూ." కాని అది వారికి ఒక్క హక్కును మాత్రమే లేకుండా చేసింది—అది చెడ్డగావ్రాసే హక్కు."

మానవునిలోని సాంఘిక, ఆర్థిక మార్పులనూ అతని దృక్పథాన్నీ, మానసిక స్థితినీ, నడవడినీ సారస్వతం గమనిస్తుంది. అక్టోబరు విప్లవ మహత్తర చారిత్రిక లాభాల ఫలితాలు 1930 తదుపరి సంవత్సరాలలో స్పష్టంగా కనిపించాయి. అప్పటి సారస్వతం మహత్తరమైన సాంఘిక, ఆర్థిక మార్పులను మాత్రమే కాకుండా, సోవియట్ ప్రజల ఆత్మిక పునర్జన్మను గూడా నమోదు చేసింది. సామ్యవాద సమాజంలోని నవమానవుడు, చరిత్ర అగ్ని పరీక్షలో ఉద్భవించాడు.

ఎ. మకరెంకో వ్రాసిన శిక్షణా కావ్యం, సమాజానికి ఉపయుక్తమైన పని వాతావరణంలో వర్గ విరహితుడైన ఒక వ్యక్తి పరివర్తన కథను చెప్పి, ఒక సమిష్టి సంస్థయొక్క క్లిష్టమైన నిర్మాణంగురించి దాని గొప్ప విద్యా శిక్షణ శక్తిగురించి బహుముఖమైన దృక్పథాన్నిచ్చింది. రచయిత, యీ విధంగా చెప్పినట్టుంది: "జదరోవ్, బురున్, వెర్షనెవ్, బ్రటెంకో యిరుగో, వీరంతా బికారులు, నేరస్తులు; పూర్వం అయితే వీరు సమాజానికి నిరుపయోగమైన వారని పరిగణింపబడేది. కాని యిప్పుడు—శ్రద్ధగా చదవండి, నేను కచ్చితంగా నిజం చెపుతున్నాను—వారు మీ కళ్ళ ఎదుటనే మారిపోతున్నారు,గతకాలపు దుష్ప్రవర్తనను త్యజిస్తున్నారు, నవసమాజ సభ్యులుగా మారుతున్నారు" ఈ దిద్దుబాటు— ఒక్కరిద్ది కాదు, అనేకులకు—అద్భుతమైనది, అత్యంతాకర్షణీయమైనది.

సామ్యవాద వాస్తవికత నిర్మాణాత్మక శక్తిని రచయిత కీర్తిస్తున్నారు,వాస్తవిక జీవితంనుంచి రచింపబడిన కావ్య పాత్రలలో ఒకరైన కథకుని భావాలు కథలోని కనులు మిరుమిట్లుగొలిపే రంగులలో, ఆయన ఉత్సాహమూ, మానవకోటిపట్ల భక్తి పాఠకునికి కలిగించక తప్పని ఏదో ఒక విస్పష్ట వాక్చిత్రంలో, ఉత్తేజిత వాక్సముదాయంలో విదితమవుతాయి.

యన్. ఓస్త్రొవస్కీ కరినసత్య భారత స్వీయ చారిత్రికనవల, ఉక్కు కు ఎలా పదును పెట్టబడింది 1930 తదుపరి ఐదేళ్లలో వెలువడింది; తొందర్లో అది సోవియట్ సారస్వతంలో ఒక మైలు రాయి అని కీర్తింపబడింది. సామ్యవాద పరివర్తన కొరకు స్వార్థ రహితంగా పోరాడే ఆదర్శ పురుషుడు, జీవితంలో యదార్థంగా ఎదురయ్యే పరిపక్వతను పొందిన వ్యక్తి. పావెల్ కోర్చగిన్ ద్వారా గ్రంథకర్త ఒక బోల్షివిక్కు పరిణామాన్ని, తన కాలపు అగ్రశ్రేణి వ్యక్తి పరిణామాన్ని చిత్రించారు. కోర్చగిన్ దీక్షత, ఆయన నైతిక దృక్పథ స్వచ్ఛత, అభేద్యమైన ఆయన విప్లవోత్సాహమూ పాఠకుని పరవశుణ్ని గావిస్తాయి.

బోల్షివిక్కులు జుక్రే, తొకరేవ్ మొదలైనవారి పలుకుబడిలోనూ, అంతర్యుద్ధ పోరాటాల్లో, తరవాత జరిగిన నిర్మాణంలోని తీవ్రకృషిలో తన పాత్రవల్లనూ యువకుడు కోర్చగిన్ పాత్ర ఎలా రూపొందిందో రచయిత చూపారు. అతి కష్టకాలంలో సైతం ఆయన జీవిత సారాంశం, యీ వాక్కులలో వ్యక్తపర్చ బడింది : "సర్వదా సిద్ధం."

పలుతరాల సోవియట్ యువకులను ఉత్తేజపర్చి, పెంచి పెద్ద చేసిన మాటలను పలికినది పావెల్ కోర్చగినే. తల్లి చెప్పిన మంచి హితవాక్కులవలె వారు వీటిని తలదాల్చారు. "మానవునికి గల అత్యంత ప్రీతిపాత్రమైనది, అతని జీవితం. అది అతనికి ఒక్కసారి మాత్రమే లభిస్తుంది. దానిని అతడు, నిష్ఫలంగా వృథా అయిన సంవత్సరాలకోసం విచారించకుండా వుండేటట్టుగా, గతకాలంలో జరిగిన అల్పమైన అకార్యాలకు సిగ్గుపడకుండే

టట్టుగా గడపాలి. తాను మరణిస్తున్నప్పుడు యీ విధంగా అన గలిగేటట్టుగా అతడు జీవించాలి: 'నా జీవితమూ, దాని యావ చ్ఛక్తి ప్రపంచమంతటికి అత్యుత్తమ విషయమై మానవజాతి విముక్తి పోరాటంకొరకు వినియోగింపబడింది" సోవియట్ సమాజానికి చెందిన నవ మానవుని ఆత్మిక రూపాన్ని యీ మాటలు పూర్తిగా ప్రతిబింబిస్తాయి.

1930 తరవాత పదేళ్ళకాలంలో వచ్చిన సాహిత్య వస్తువుల, రూపాలలోని ఆశ్చర్యకరమైన వైవిధ్యమూ, సమృద్ధి, వర్తమాన కాలపు, దానిలో తన స్థానంయొక్క, యిటీవలి విప్లవంయొక్క, అంతర్యుద్ధం యొక్క సంపూర్ణ అర్థాన్నే కాకుండా, తన ప్రజల యావత్తు చరిత్రయొక్క, దాని అత్యంత ప్రముఖులయొక్క సంపూర్ణ అర్థాన్ని కూడా గ్రహించడానికి కృషి చేస్తోన్న సోవియట్ మానవుని ఆత్మిక సంపదను వెల్లడి చేశాయి.

యన్. ఓస్త్రొవస్కీ వ్రాసిన ఉక్కుకు ఎలా పదును పెట్ట బడింది, ఎ. టాల్‌స్టాయి వ్రాసిన మొదటి పీటర్, యం. షోలొ ఖోవ్ వ్రాసిన బీళ్లు దున్నేరు, యం. గోర్కీ వ్రాసిన క్లిమ్ సమ్గిన్ జీవితమూ, కె. ఫెడిన్ వ్రాసిన యూరప్ చెర, ఎ. ఫెదయేవ్ వ్రాసిన ఉదెగెస్‌లో చివరివారు వంటి సాహిత్యరచనలు సమానంగా విలువైనవి. వివిధ శైలులలోనూ, రూపాలలోనూ వ్రాసిన యీ గ్రంథాలు ఒకేఒక సృజనాత్మక ప్రవాహానికి-సామ్యవాద వాస్తవిక తకు-చెందిన సారస్వతంగా పరిగణింప బడుతున్నాయి.

గోర్కీ చివరి రచన అయిన క్లిమ్ సమ్గిన్ జీవితం, యీ "వీడ్కోలు కథ" రష్యన్ జీవితంలో చాలా భాగాన్ని-1880 నుండి 1918 వరకూ కాలాన్ని-పెనవేసుకుని వుంది. లునచర్‌స్కీ యీ రచన గురించి "దశాబ్దాల హృదయాన్ని కదిలించే దృశ్యం" అని అన్నారు. రెండు రష్యన్ విప్లవాలకు బాటను వేసిన యీ శకాన్ని గోర్కీ సంక్లిష్టతా భరితంగా, వివిధ వర్గాలతో, చారిత్రికమైన బిగువుతో వెల్లడించారు. అనేక దశాబ్దాల రష్యన్ జీవితం అందంగా చిత్రింపపడిన పాత్రల ద్వారా, వారి జాతీయ గుణాలన్నిటిద్వారా ప్రద ర్శింపబడింది. రష్యన్ సమాజాన్ని స్థాలీపులాక న్యాయంగా రచ యిత చూపారని చెప్పవచ్చును. జీవితంలోని అన్ని హంశాలూ బాగా ఎరిగివున్న గోర్కీ అత్యంత వైవిధ్యంగల పాత్రలను బాగా సృష్టించారు—నరోద్నిక్ మేధావులనూ, సంకుచిత వాదులనూ, జారునూ, ఆయన మంత్రులనూ, వివిధ అటొర్నీలనూ, పారిశ్రామికు లనూ, విద్యార్థులనూ, వైద్యులనూ, కార్మికులనూ, బ్లాక్ హండ్రెడ్ బందిపోట్లనూ, రెచ్చగొట్టేవారినీ....వీటన్నిటినీ లెక్కించడం చాలా కష్టం!

వ్యక్తుల జీవితాల చిత్రణను గోర్కీ, వాస్తవికమైన కాల చిత్రణతో, విప్లవం తధ్యమన్న భావాన్ని కలుగజేసే దృశ్యంతో కలిపి చిత్రించారు.

వ్యక్తి తత్త్వాన్ని, దాని జుగుప్సాకరమైన హంశాలన్నిటితో బాటుగా—రాజకీయమైనవీ, సాంఘికమైనవీ కూడా—తన పాత్ర క్లిమ్ సమగిన్ ద్వారా బట్టబయలుచేస్తూ, గోర్కీ కళాకారునికి నిజ మైన ఉద్రేకంతో, సోవియట్ సమాజంలో వివిధ రూపాలతో గల గత కాలపు అవశేషాలైన వ్యక్తిగత దురభిమానాలను తూర్పార బట్టారు.

మానవునికీ మానవునికీ మధ్యగల సంబంధం గురించి కార్య వస్తువు, పుష్కిన్ కాలంనుండీ రష్యన్ సాహితీ పిపాసుల మనస్సు లను ఉత్తేజ పర్చింది. పుష్కిన్‌యొక్క విషాదాంత రచన బోరిస్ గొదునోవ్‌లో ఆఖరు దృశ్యంలోని ప్రజల అశుభసూచకమైన మౌనం, చరిత్రలో ప్రజాసామాన్యం యొక్క పాత్రను కనుగొనడానికి, వ్యక్తికీ ప్రజలకూ మధ్యగల సంబంధాన్ని కనుగొనడానికి బహుశా ప్రథమ ప్రయత్నమై వుండవచ్చును.

వ్యక్తుల భవిష్యత్తు సన్నిహిత సంబంధంతో, చరిత్రకు నిజ మైన సృష్టికర్తలైన ప్రజా సామాన్యపు చారిత్రికోద్యమంతో అవినా భావ సంబంధంలో చిత్రింపబడాలని జీవితసత్యమే కోరుతోంది.

తన ఉత్తమ రచనలలో ఒకటైన మూడుభాగాల నవల కఠిన పరీక్షలో ఎ. టాల్‌స్టాయి నిజాయితీగల రష్యన్ మేధావుల దుర్గతిని వర్ణించారు. ఈ మూడు భాగాలలో మొదటి నవల (అక్క చెల్లెళ్లు) 1920 మొదట్లో వ్రాయబడింది, యిది ఒక కుటుంబ కథను వివ రిస్తుంది.

ఒకొక్క కొత్త గ్రంథమూ కథను విస్తరింప జేసింది. అక్క చెల్లెళ్ల సుఖవంతమైన జీవితం ఒకపెద్ద వరదలో పూర్తిగా కొట్టుక పోయింది; పందొమ్మిదో శతాబ్దపు మూడో దశాబ్దం చివరనూ, నాలుగో దశాబ్దం ఆరంభంలోనూ గ్రంథకర్త మననుము లగ్నంచేసిన తదుపరి సంపుటాలలో పొందుపరచబడిన చిత్రవిచిత్రమైన సంఘట నలలో పూర్తిగా కొట్టుకపోయింది. టాల్‌స్టాయి పాత్రలు, మొదట ప్రజలకు చాలా దూరంగావుంటూ, నిస్తబ్ద సారస్వత, దుష్ట చట్ట అతి క్రమణలకు చెందిన చిన్న క్షీణ లోకంలో దేవులాడుతూ, చివరకు చాలా విషయాలను తెలుసుకుంటాయి. యుద్ధమూ, విప్లవమూ వాటిని రష్యాలో దూర దూరాలకు విసిరివేశాయి. ప్రజలకు తాము ఎంత దూరంగా వున్నవో అవి తెలుసుకునేటట్టుగానూ, యిటువంటి వెలి వల్ల కలిగే విషాదాన్ని అనుభవించేటట్టుగానూ. దేశంపట్ల వారి ప్రేమ, వారి నిజాయితీ చివరకు వారిని విప్లవ శిబిరంలోకి తీసుకవస్తాయి. గ్రంథకర్త కవితామయంగా, ఉత్తేజకరంగా తన మాతృభూమి రష్యా చిత్రణ, దేశభక్తి నిజమైన ఆధారభూతమైన విప్లవ ప్రజలతో అఖండ సంబంధం గలది.

తన డాన్ నదీ ప్రశాంత ప్రవాహం చివరి భాగాన్ని వ్రాస్తూ యం. షొలొఖోవ్ హేతుబద్ధంగా, సహజంగా గడిచే చారిత్రిక పరి ణామాన్ని విశ్వసనీయంగా చూపే హంశాలకు కళాత్మకమైన, నిర్దిష్ట మైన రూపాన్నిచ్చే కష్టమైన పనికి పూనుకున్నారు.

గ్రంథకర్త శ్రామిక ప్రజలలోనూ, చరిత్రలోని ఒక ముఖ్య ఘట్టంలో వారి జీవితాలలోనూ నిమగ్నంగా వున్నారు. అత్యంత ముఖ్య సంఘటనలు జరిగిన (1912-1922) అనేక సంవత్సరాల కాలానికి చెందినది, డాన్ నదీ ప్రశాంత ప్రవాహం కథ, నాలుగు సంపుటాలు గల యీ మహా గ్రంథం డాన్ నదీ తీరంలోని తాతారస్కలో తమ యింట్లో మెలెఖోవ్ కుటుంబం అనే కోసక్ కుటుంబం గురించీ, ప్రథమ ప్రపంచ సమర యుద్ధ రంగంలోని

పోరాటం గురించి, విప్లవ పెత్రోగ్రాద్ గురించి, మాస్కో గురించి, మళ్ళీ డాన్ గురించి వర్ణిస్తుంది. సుదీర్ఘమైన తీవ్ర అంతర్యుద్ధ కాల అద్భుత పరిస్థితులు క్రమక్రమంగా వెల్లడవుతాయి.

షొలొఖోవ్ విప్లవానికీ, దానితో వ్యక్తులకూ, ప్రజా సామాన్యానికీ గల వివిధ సంబంధాలనూ కూడా పేర్కొన్నారు. ఈ క్రమంలో ఆయన ఎన్నో కళాత్మక విషయాలను కనుగొన్నారు. కమ్యూనిస్టులను చిత్రించడంలో, షొలొఖోవ్ ప్రజలతో గల నిత్య సంబంధాలు జీవితంలో వ్యక్తి స్థానాన్ని బలపర్చుతుందనీ, ఆశాభావాన్నీ, పోరాటంలో గొప్ప స్వార్థత్యాగాన్నీ ఉత్తేజపర్చి, విప్లవ మానవతా ఉన్నత భావాలను రేకెత్తిస్తుందనీ (పొద్‌తెల్కోవ్, కోషెవోయ్, కోత్ల్యరోవ్, లిఖచోవ్ మొదలైనవారు) చూపారు. దోపిడీవర్గ ప్రతినిధులు ప్రజలకు విభిన్నమైనవారు, వ్యతిరేకులని రచయిత వాదించారు గ్రంథకర్త. దండకులుగానూ, హంతకులుగానూ మారినప్పుడు వారెటువంటి నీచానికి ఒడిగడతారో విప్లవమూ, అంతర్యుద్ధమూ పూర్తిగా చూపాయి (లిత్నిత్స్కీ, కోర్షునోవ్, చెర్నెత్సోవ్).

ఈ సారస్వత దశలో ప్రగతి యింకిపోలేదు కూడా. నాటక ప్రేక్షకులు ఎ. కోర్నిచుక్ వంటి నాటక కర్తల నాటకాలను చూశారు. ప్లాటూన్ క్రెచెత్ అనే ఆయన నాటకం,— యువకుడు, ప్రతిభాశాలీ, ధైర్యశాలి అయిన ఒక శస్త్రవైద్యుని కథ యిది —చాలామందిచే ప్రదర్శింపబడింది.

యుద్ధ ప్రమాదాన్ని సూచిస్తూ అధికతరంగా హెచ్చరిక చేసింది కూడా, యీ కాలపు సారస్వతం. భౌతిక సంపదలకే కాకుండా, ప్రజలను రూపొందించే నైతిక విలువలు కూడా అగ్ని పరీక్షకు నిలబడింది, దేశం.

## సోవియట్ విజ్ఞాన శాస్త్రం, ఇంజినీరింగుల మహత్తర విజయం

(2వ పుట తరువాయి)

విజయమనడానికి ఎంత మాత్రమూ సందేహం లేదు, నేను వారిని అభినందిస్తున్నాను" అన్నారు ఫ్రెడ్ విప్లె, మసాచ్యుసెట్స్, కాంబ్రిడ్జిలోని స్మిత్ సోనియన్ ఇన్‌స్టిట్యూషన్ అస్ట్రో ఫిజికల్ అబ్జర్వేటరీ డైరెక్టర్, అన్నారు.

మానవ సేవకు వినియోగమవుతోన్న సోవియట్ విజ్ఞానశాస్త్ర ప్రగతికి సహజ ఫలితమే, ప్రపంచానికి ప్రథమ భూ ఉపగ్రహాన్ని ఎగురవెయ్యడమన్న తిరుగులేని సత్యాన్ని అమెరికన్ ప్రచారకులు దాచివెయ్యలేరు. ఈ సత్యానికి అంగీకారాన్ని, తను సోవియట్ వ్యతిరేక అభిప్రాయాలకు పేరుపడ్డ "న్యూయార్క్ టైమ్స్" వ్యాఖ్యాత హారీ ష్వార్ట్జ్ వంటి వారినుంచి యిప్పుడు వినవచ్చునని "ప్రవ్దా" తెలియజేస్తోంది. "సోవియట్ దేశం దీనినెలా చేసింది ?" అన్న బాధాకరమైన ప్రశ్న ష్వార్ట్జ్‌కు ఖేదాన్ని కలుగజేస్తుంది. ఆయనయిలా ఒప్పుకోక తప్పలేదు : "సోవియట్ దేశం సాధించిన యీ విజయం, నేటి విజ్ఞానశాస్త్ర, సాంకేతిక విద్యల మహాద్భుతమిదని సోవియట్ దేశం ప్రధానంగా స్పష్టపర్చుతోంది. ఒకటో తరగతికి చెందిన వైజ్ఞానిక-సాంకేతిక సిబ్బంది, విజ్ఞాన సాంకేతిక శాస్త్రాల చాలా విస్తృత రంగంలో, అతిముఖ్యమైన వాటిని మాత్రమే పేర్కొనాలంటే గణిత, పదార్థ విజ్ఞాన, రసాయనిక, లోహ శాస్త్రాలలో ఒకటో తరగతికి చెందిన పరిస్థితులూ గల దేశం మాత్రమే యీ అద్భుతాన్ని సాధించగలదు."

తన సంపాదకీయంలో "న్యూయార్క్ టైమ్స్" పత్రిక ఇలా వ్రాస్తోంది : "'అంతర్గ్రహ మహాకాశంపైని అధిపత్యం వహించడంలో గొప్ప ముందడుగు'ను వేసిన సోవియట్ విజ్ఞాన శాస్త్రవేత్తలకు సర్వ మానవకోటి కృతజ్ఞతను చూపాలి," అంటూ ఆ వార్తా పత్రిక యిలా ఉద్ఘాటించింది : "మానవజాతి అంతటికీ గర్వకారణమైనది యీ అద్భుత కృత్యం. దీనిని చేసి సోవియట్ పౌరులు, దశాబ్దులుగా, శతాబ్దులుగా పలుదేశాల ప్రజలు నిర్మించిన బ్రహ్మాండమైన కట్టడం శిఖరంపైని కిరీటాన్ని ఉంచారు."

సోవియట్ దేశపు "వైజ్ఞానిక-సాంకేతిక వెనుకబాటు తనం" గురించి బూర్జువా ప్రచార కల్పిత గాథలలోని తప్పును ప్రముఖ అమెరికన్ వ్యాఖ్యాతలు గుర్తించిన నేడు, శాంతియుత సహజీవనం, అమితాయుధోత్పత్తి అపుదల, "ప్రచ్ఛన్న యుద్ధ" విధాన నిరాకరణల ఆవశ్యకత గురించి అమెరికన్ పాలక వర్గాలను తిరస్కరించ వీలుకాని సమస్య ఎదుర్కొంటోందని 'ప్రవ్దా' విలేఖరి ఉద్ఘాటిస్తున్నారు. పన్నుగడలను పన్నడానికి, అంతరాతీయ ఉద్రిక్తతా ఉపశమన విరోధులు ఎంతగా ప్రయత్నించినా, జీవితమే రేకెత్తించిన యీ విషయాలనుండి వారెన్నడూ తప్పించుకోలేరు.

## రష్యన్ నదీమతల్లికి భారతీయుని కానుక

(3వ పుట తరువాయి)

విద్యార్థే చేయాలని మేమంతా అంగీకరించాం.

మేము కలినిన్‌కు బయలుదేరాం. కలినిన్‌లోని అన్నిటికంటె పెద్ద విద్యాసంస్థ, వైద్య విద్యాలయం. మేము దానికి బయలుదేరాం. ఒసారాలో ఒక విద్యార్థినీ బృందం ఎదురైంది.

మా భారతీయ మిత్రుని కోర్కె గురించి మేమా బాలికలకు చెప్పి, అతని లేఖను వారికిచ్చాము. వారు శ్రద్ధగా ఆ ఉత్తరం చదివి, ప్రేమ్‌చంద్ కోర్కెను నెరవేర్చడానికి చాలా ఆతృత చూపారు.

ఆ బాలికలు పూలతోటనుండి అతి చక్కని పూలగుత్తును కోశారు. ఈ పూలగుత్తును ఓల్గాకు అర్పించే గౌరవం నీనా అత్లస్కినా అనే వైద్య విద్యాలయ విద్యార్థినికి లభించింది (పత్రిక చివర అట్టమీద ఆమె చిత్రం వుంది).

ఓల్గా హృదయంలోనికి పూలగుత్తి అదృశ్యమైపోయాక, మేమా బాలికల వద్ద సెలవుతీసుకున్నాము. బయలుదేరుతూ వారు ప్రేమ్‌చంద్‌కూ, భారతీయ విద్యార్థులందరికీ అభినందనలనూ, విద్యావ్యాసంగంలో విజయాకాంక్షలనూ అందజేయమని మమ్మకోరారు. "వారి జీవితాలు మన ఓల్గానదివలె సంపూర్ణంగా విలసిల్లునుగాక !" అన్నారు వారు.

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరపున, జి. ఎఫిమోవ్‌చే 25, బారాకంబా రోడ్, న్యూఢిల్లీనుండి, సంపాదితము, ఎన్. కె. దొరొద్నిత్సిన్‌చే ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు : పంజాబి ప్రెస్, సదర్ బజార్, ఢిల్లీ—6.



తెలివైన తోటమాలి.

కొమ్మమీదకాదు కొమ్ముమీద.



# వినోద చిత్రాలు











మారేది ఫాషన్లా, మనుషులా?





రెండు ఎరలు, ఒక చేప!

